# శ్రీ సుమిత్రానందన్ పంత్

## అభినందన సంచిక



శా.శ. [illegible]
సంపుటి 7

టెలిగ్రామ్: హిందీసభ
సంచిక

# ప్రవంతి

## సాహిత్య మాసపత్రిక

సుప్రసిద్ధ హిందీ మహాకవి

# శ్రీ సుమిత్రానందన్ పంత్

## అభినందన సంచిక

*

సంపాదక మండలి :

శ్రీ మోటూరి సత్యనారాయణ, M. P.
(అధ్యక్షులు)
శ్రీ కాటూరి వేంకటేశ్వరరావు
శ్రీ పప్పూరి రామాచార్యులు
శ్రీ సి. నారాయణరెడ్డి
శ్రీ చిట్టూరి లక్ష్మీనారాయణశర్మ

*

దక్షిణ భారత హిందీ ప్రచార సభ - ఆంధ్ర
959, ఖైరతాబాదు — హైదరాబాదు - 4

సంవత్సర చందా
రు. 4.00

జూన్
1960

ప్రత్యేక సంచిక
రు. 1.00

Recommended for use in all the public libraries and school libraries by the Director of Public Libraries, Andhra State, Madras, vide Proceedings Dis. No 30/55 dated 6th January 1955

# ఈ సంచికలో

# కృతజ్ఞత

శ్రీ సుమిత్రానందన్ పంతు, వీరి పేరు తలచుకోవడమే తడవుగ సౌకుమార్యం, సౌందర్యం కన్నులకు కట్టినట్లు ఉంటాయి. వీరి శరీరసౌష్ఠవం, కళా ప్రతిష్ఠతో పాటు కమనీయమైన కాంతిని వెదచల్లుతూ జగన్మోహనంగ ఉంటుంది. సౌకుమార్యం వారి సొత్తు సౌందర్యానికీ, వీరికీ చాలా పొత్తు. ఆ ముక్కు, ముఖము ఆ కనులు, కనుబొమలు, ఆ చెక్కిళ్లు, ఆ నిండైన కేశములు, దేవీశారదను స్మరణకు తెస్తూ ఉంటవి. 1930 నాటి ఇది ఒక మధురస్మృతి. వారణాసిలో ప్రప్రథమంగా వీరిని దర్శించుట జరిగినది.

ప్రత్యక్షపరిచయం వీరితో నాకు చాల తక్కువ, కాని అధ్యయనం, అధ్యాపనం ద్వారా బాగా పరిచయమున్నదనే చెప్పుకోవచ్చు. దక్షిణ భారత హిందీ ప్రచార సభ వారితో వీరికిగల సంబంధము చక్కని సౌజన్యంతో కూడినది; స్నేహపూర్వకమైనది. వీరి లేఖిని నుండి వెలువడిన ప్రతి శబ్దము స్వరలయలతో, సంగీత మాధుర్యంతో మేళవింపబడి సుకుమారంగ వయ్యారంగ కళాత్మకమైన చిందులు త్రొక్కుచు భావస్రవంతిలో పయనం చేస్తూ ఉంటుంది. వీరి కవిత్వంలో సత్యం, శివం, సుందరంలో శివం, సుందరం పాళ్లు అధికంగ కనిపిస్తూ ఉంటవి. అందుబాటులోని అందమైన కవిత్వం.

పంతులుగారి అభినందన సంచిక ప్రకటించు అవకాశమిచ్చినందులకు ఆలిండియా రేడియో వారికి మా హృదయపూర్వకమైన అభివందనములు. ఈ విషయంలో ముఖ్యంగ పద్మశ్రీ మోటూరి సత్యనారాయణగారి సహకారమునకు కృతజ్ఞులము. ఈ సంచికవలన సహృదయులైన స్రవంతి పాఠకులు ప్రత్యేక లాభమును పొందగలరని విశ్వసించుచున్నాము.

చిట్టూరి లక్ష్మీనారాయణ శర్మ
కార్యదర్శి
దక్షిణ భారత హిందీ ప్రచార సభ-ఆంధ్ర

# కవి సుమిత్రానందన్ పంత్ జీవిత పరిచయం

శ్రీ సుమిత్రానందన్ పంతు 20, మే 1900 సంవత్సరములో జన్మించినారు. అల్మోరా జిల్లాలోని కౌసాని ఆయన జన్మస్థానము. అల్మోరాకు ఉత్తరంగా 32 మైళ్ళ దూరంలోనున్న రమణీయ ప్రదేశమది. సముద్ర మట్టానికి షుమారు 7000 అడుగుల యెత్తుననున్న యీ పర్వతప్రాంతం దేవదారు, టేకు, ఓకు వృక్షాలతో పచ్చ పచ్చగా కన్నులకు యింపు గొలుపుతూ వుంటుంది. దానికి ఉత్తరంగా నగాధిరాజు హిమాలయ పర్వతం తన ఉత్తుంగ శిఖరాలతో అత్యున్నతంగా ప్రకాశించుతూ ఉంటుంది. ఈ శోభను చూచి ఒకసారి మహాత్మా గాంధీకూడా ముగ్ధుడైపోయాడు. మహాత్మా గాంధి అనాసక్తి యోగమనే పేరుతో గీతకు వ్యాఖ్యానంకూడా అక్కడే రచించారు.

ఇలాంటి అందమైన ప్రదేశంలో జన్మించినవాళ్ళు అందరూ కవులు కాలేరు. కాని, కవి పంత్ అక్కడ జన్మించడం ఒక విశేషం. మే మాసంలో ఉత్తర ప్రదేశంలోనూ, విశాల మైదానాల్లోనూ, తీవ్రమైన వడగాడ్పులు వీచే సమయంలో, ఎర్రని, నల్లని, పచ్చని తుఫానులు వికటాట్టహాసంచేసే సమయంలో యీ అల్మోరా పర్వత ప్రాంతం వసంతపు వన్నె చిన్నెల్ని చిందుతూ వుంటుంది. పగళ్ళు హృద్యంగావుంటాయి. అలాంటి వొక పగటి సమయంలోనే పంతు యీ విశాల విశ్వంలో అవతరించారు. ఆ రోజునే సూర్యాస్తమయానికి కొంచెం ముందుగా ఆయన తల్లి దివంగతురాలైంది. పుట్టిన 6 గంటలకే మగ శిశువు తల్లిని కోల్పోయాడు. అందువల్లే పంతు పరివర్తననే కవితలో యిలా వ్రాశారు:

" ఈవల పుట్టుక కన్నులు విప్పెను
ఆవల మృత్యువు కన్నులు మోడ్చెను "

శ్రీ సుమిత్రానందన్ పంతు తల్లిపేరు సరస్వతి. తండ్రిగారైన పండిత్ గంగాదత్తపంత్ మాతృహీనుడైన ఆ పుత్రుణ్ణి ఎంతో గారాబంగా పెంచి పెద్దవాణ్ణి చేశారు. మేనత్త పిల్లవాణ్ణి అతి మమకారంతో పెంచింది. ఒక దాదినికూడా పనికి కుదిర్చారు. పంతుని పొరిగిటి [illegible]

అను గోసాయికి ఇచ్చివేశారు. అప్పుడతనిని గోసాయి దత్త అనిపిలుస్తారు. హరిగిరి బాబా యీ పిల్లవానికి నామకరణం చేసి ఆశీర్వాదమన్నట్టు ఒక రుద్రాక్షమాల మెడలో వేశాడు.

ఇలా పెద్దవాళ్ళ లాలన పాలనలో పెరిగి పంత్ పెద్దవాడయ్యాడు. మేనత్త భక్తిగీతాలను పాడుతూవుంటే పిల్లవాడు తన్మయుడై వింటుండేవాడు. కళ్ళల్లో ఎప్పుడూ ఆ పరిసర వృక్షాల పచ్చదనమే మెరుస్తూ వుండేది. తనకంటె అన్నగారైన దేవిదత్త పంతు రెండేండ్లు పెద్ద. వాళ్ళిద్దరూ యింటి ముంగిలిలోవున్న రెండు వృక్షాలను పంచుకున్నారు. వృక్షాలంటే గోసాయి దత్ కెంతో ప్రీతి. దీనికి ఆశ్చర్యపడ నవసరంలేదు. ఎందుకంటే కవి జన్మించిన సంవత్సరంలో అంటే 1900 లో జగదీశచంద్ర బోసు వృక్షాల్లో ప్రాణముందని ఋజువు చేశారు.

ఐదు సంవత్సరాల వయస్సులో పంతుకు అక్షరాభ్యాసం చేశారు. మామయ్య అక్షరాలు దిద్దబెట్టాడు. ఏడు సంవత్సరాలు వచ్చునప్పటికి ఊరి బడిలో ప్రవేశించాడు. తన యింటిలోకూడా చదువుకు కావలసిన వాతావరణం పుష్కలంగా వుంది. తొమ్మిది సంవత్సరాలు వచ్చి రాక మునుపే పంతు అమరకోశం, చాణక్య నీతి, రామరక్షా స్తోత్రం, యింకా అనేక సంస్కృత శ్లోకాలు వల్లెవేశాడు. మామయ్య సంస్కృతం చెప్పాడు. తండ్రిగారు యింగ్లీషు చెప్పారు. నలుగురు అన్నల్లోనూ పెద్ద అన్నయైన హరనందన్ పంత్ గారు తన చిట్టితమ్మునికి హిందీ కావ్యపఠనంలో ఆసక్తి కలుగజేశారు. పంతు సంగీతంకూడా నేర్చుకున్నాడు. ఇంటిలోనూ యింటి బయట పాఠశాలలోనూ చదువు యథాప్రకారంగా కొనసాగుతూనే వుంది. వీటికి తోడు, వీటికంటె కూడా వొక మహోన్నత విద్యాలయం పంతుకు లభించింది. అది యెత్తైన హిమ శిఖరం. అదే పంతుకు మౌన మహోపదేశము, క్రీడా రంగము. ఆ పచ్చని గిరి ప్రాంత భూమియే అతని గురువు. ప్రకృతి, మాతృహీన బాలకునికి మాతగా నిలిచింది. నిసర్గ ప్రకృతి చ్ఛటలతో పంతు ఆడుకొంటూ ఉండేవాడు. ఈ భాష కవికి హిమవత్పర్వతం ఆదర్శాన్ని యిచ్చింది. హరిత భూముల్లూ, ఉపత్యకలూ అతని హృదయాన్ని రస నిమగ్నం చేశాయి.

పన్నెండవ సంవత్సరంలో అల్మోడాలోని గవర్నమెంటు హైస్కూలులో చేరినతర్వాత పంతు తన గోసాయి దత్త అనే పేరును

తిని వేసి సుమిత్రానందన్ పంత్ అని నామకరణం చేసికున్నాడు. గోసాయి యిచ్చిన రుద్రాక్ష మాల కూడా తొలగించి వేసుకున్నాడు. హైస్కూల్లో రకరకాల అల్లరి పిల్లలసుర్ధ్య తిరుగుతూనే వాళ్ళు చేసే వేళాకోళాలకు గురియౌతూనే అందమైన దుస్తులు వేసుకుంటూ కావ్య పద్య పల్లో దిద్దుకున్న వెంట్రుకలను సవరించుకుంటూ తన సౌందర్య ప్రవృత్తిని సహజంగానే వివనాశ లేక పోతూ ఉండేవాడు. ప్రతికూల వాతావరణం లభించినందు వలన అతని ప్రవృత్తి సహజంగానే అంతర్దృష్టి సంపన్న మైనది.

అల్మోడాకు దేశ దేశాలనుంచి విద్వాంసులు, ఉపన్యాసకులూ, ఉప దేశకులూ వస్తూవుండేవారు. ఆర్య సమాజంలో బాగా పేరుగడించిన స్వామీ సత్యదేవ్ ఉపన్యాసాలు అతనిలో ఉత్సాహాన్ని రేకెత్తింపజేశాయి. అలాగే వివేకానందుని తేజఃపూరితములైన ఉపన్యాసములు కౌమార ప్రాయుడైన పంతు హృదయాన్ని కిలిగింతలు పెట్టాయి. పునర్జాగృతిలో దేశం ఉద్యూతలూగుతున్న ఆ సమయంలో మాతృభాషను, మాతృభూమిని సేవించడమే ఒక గొప్ప జాగృతి మంత్రంగా భావించబడేది. కవి పంత్ కూడా ఆ మంత్రాన్ని ఉపాసించాడు. మాతృభూమిని సేవావ్రతంగా గైకొని మాతృభాష యైన హిందీద్వారా పంత్ సాంస్కృతిక కార్య కలాపాల్లో పాలు పంచుకుంటూ ఉండేవాడు. ఉపన్యాస వేదికలు, స్థానిక వివరణ పత్రికలు, వార్తా పత్రికలు, మొదలైన వాటిని చేయూత గొని స్థానిక సాంస్కృతిక పునర్జాగృతికి వీలైన ప్రజా కార్యములతో సహకరించడం నేర్చుకున్నాడు. బడి చదువు మీద ఎక్కువ దృష్టి లేకపోవడంవల్ల ఆ సంవత్సరం హైస్కూలు పరీక్షలలో తప్పినాడు.

ఒకటి. హైస్కూలు పరీక్షలలో కూర్చోడానికి రెండు సంవత్సరములు ముందే 'హార్' అనే నవల వ్రాశాడు. ఇది అతని తొలి రచన. అయినా సంపూర్ణమైన రచన. పదహారవ యేట రచియింపబడిన యీ నవల యిప్పుడు ఈ కవి యొక్క షష్టి పూర్తి ఉత్సవ సందర్భమున ప్రచురించబడు చున్నది. కాశీలో చదువు తున్నప్పుడు సెలవుల రోజులలో రచియించిన నవల యిది. ఈ నవలేగాక పంత్ విడివిడిగా చాలా పద్యకవితలు వ్రాశాడు. అవన్నీ అప్పటి వ్రాత పత్రికల్లోనూ, ముద్రిత పత్రికల్లోనూ ప్రచురించ బడ్డవి. ఈ రచనల్లో వైచిత్రి, వ్యక్తిత్వ చిహ్నాలు స్పష్టంగా కనుపించు

తవి. "చర్చి ఘంట" 'చుట్ట పొగ' "కాగితపు పువ్వులు" మొదలైన రచనలు వీటికి ఉదాహరణలుగా చెప్పవచ్చు.

1919 లో పంత్ చదువు నిమిత్తం కాశీ వెళ్లారు. అక్కడ హైస్కూలు పరీక్ష లిచ్చి ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణులయ్యారు. పాఠశాల కవితా పోటీలలో ఆయనకు ప్రథమ స్థానం లభించినది. తరువాత కాశీ నాగరీ ప్రచారణీ సభవారు ఆయన రచించిన "గుంజన్" కావ్య సంగ్రహానికి ఒక పారితోషికాన్ని, సన్మాన పత్రాన్ని ప్రదానం చేశారు.

కాశీలో ఆయన బెంగాలీ భాష నభ్యసించి మూల భాషలోనే రవీంద్ర సాహిత్యాన్ని అధ్యయనం చేశారు. సరోజనీ నాయుడు కవిత్వాలను గూడ చదివారు. కాశీలో ఉన్నప్పుడే పంత్ తనను కవితా వ్యాసంగానికి అనుకూలంగా రూపొందించుకోవడానికి తీవ్ర ప్రయత్నం చేశారు. ఇంతకు పూర్వమే కాళిదాసు కావ్యాలతో పరిచయమున్నను తిరిగి వాటిని నిశితంగా అధ్యయనం చేశారు. రీతి కాల కవులను గురించి కూడా యథావిధిగా అధ్యయనం చేశారు. ఆ రోజులలోనే రవీంద్రనాథ టాగూరును ప్రత్యక్షంగా చూడడం వలన పంతులో కవితా వ్యాసంగం పై మరీ విపరీతమైన మమకారం పెరిగింది. కాశీలో ఉండగనే "ప్రథమ రశ్మి" ని రచించారు 'వీణా' కావ్యాన్ని' సంగ్రహించడం కూడా అప్పుడే జరిగింది. ఇంకా యెన్నో కవిత్వాలు ఆ సమయంలోనే వచ్చినాయి.

1919, వేసవి సెలవలలో "గ్రంథి" అనే ఖండ కావ్యాన్ని వ్రాశారు.

ఉత్తర ప్రదేశ్ లోని అల్మోడా, కాశీ జిల్లాలలో తతిమ్మా జిల్లాల కంటే విద్యా ప్రచారం ఎక్కువగా వుండేది. పట్టణాల వారీగా చూస్తే అలహాబాదు విద్యా విషయంలో అన్నిటికంటె ముందున్నది. అక్కడవున్న మ్యోర్ సెంట్రల్ కాలేజి పేరు, ప్రఖ్యాతులు దూర దూరాలకు కూడా వ్యాపించినాయి. 1919 జూలై మాసంలో ఆ కాలేజిలో భర్తీ అయి హిందూ బోర్డింగ్ హౌస్ హోస్టల్లో ఉండటం జరిగింది. 1919—1920 లో స్థానిక కవి సమ్మేళనములలో 'స్వప్నము' "ఛాయ" అనే కవిత్వాలను రాగయుక్తంగా చదివి పంత్ హిందీ ప్రజల ఆదరాభి మానాలను చూరగొన్నారు. అప్పటి నుంచే ఆయన హిందీలో సుకుమార కోమల కాంతకవి అని పిలువ బడినారు.

(తరువాయి 190 వ పేజీలో)

★ ★

# ప్రథమ రశ్మి

ప్రథమ రశ్మికా ఆనా రంగిణి
తూనే కైసే పహచానా ?
కహాఁ కహాఁ హే బాలవిహంగిని !
పాయా, తూనే యహ్ గానా ?

సోయీ థీ తూ స్వప్ననీడ్ మేఁ
పంఖోంకే సుఖమేఁ ఛిప్‌కర్,
ఝూమ్ రహే థే, ఘూమ్ ద్వార్ పర్,
ప్రహరీ-సే జుగునూ నానా.

శశి కిరణోంసే ఉతర్ ఉతర్‌కర్
భూపర్ కామరూప నభచర్
చూమ్ నవల కలియోంకా మృదుముఖ్
సిఖా రహే థే ముస్కానా

స్నేహహీన తారోం కే దీపక్,
శ్యాపశూన్య థే తరుకే పాత్,
విచర్ రహే థే స్వప్న అవని మేఁ
తమ్ నే థా మండప తానా.

కూక్ ఉఠీ సహసా తరువాసిని,
గా తూ స్వాగత కా గానా,
కిస్‌నే తుఝుకో అంతర్యామిని,
బతలాయా [illegible] ఆనా ?

# ప్రథమ రశ్మి. ★ ★

తొలివెలుతురు రేకల రాకలనెటు
తెలిసితివే ? వ్యోమకురంగీ !
నిరాయాసముగ ఈ గానమునెట
నేర్చితివే ? బాలవిహంగీ !

స్వప్ననీడమున రెక్కలనీడల
శయనించితివే శాంతముగా,
మిణుగురు పురుగులు నీడము ముంగిట
మెరయుచునుండె ననంతముగా.

అమృతకిరణు కరసోపానము దిగి
అంబర చారులు వచ్చిరిలే,
మొగ్గసువాని భవన్మృదు ముఖమును
ముద్దిడి నవ్వుట నేర్పిరిలే,

స్నేహం హీనములు తారల దివ్వెలు,
శ్వాసశూన్యములు తరు పత్రాళి,
ధరణిపైన స్వప్నముల విహారము,
దశదిశలందంధకార కేళి.

సహసా కూజిత తరుసంవాసిని !
స్వాగత గీతము పాడగదే !
వెలుగుల రాకల, నంతర్యామిని !
తెలిపిరి నీకెవరే ? ఎవరే ?

వికల్ సృషికే అంధగర్భసే
ఛాయాతన్‌బహుఛాయా హీన్,
చక్ర రచరహే థే ఖల నిశిచర్
చలా కుహుక్, టోనా మానా.

ఛిపా రహీ థీ ముఖ శశిబాలా
నిశికే శ్రమసే హో శ్రీహీన్
కమల్ క్రోడ్ మే బందీ థా అలి,
కోక శోకసే దీవానా.

మూర్ఛిత థీం ఇంద్రియాం, స్తబ్ధజగ్ :
జడచేతన్ సబ్ ఏకాకార్
శూన్య విశ్వకే ఉర్ మేం కేవల్
సాంసోంకా ఆనా జానా.

తూనేహీ పహలే బహు దర్శిని,
గాయా జాగృతి కా గానా,
శ్రీ సుఖ సౌరభ కా నభచారిణి,
గూంథ్ దియా తానాబానా.

నిరాకార తమ మానో సహసా
జ్యోతిపుంజమేం హో సాకార్,
బదల్‌గయా ద్రుత జగత జాల్‌మేం.
ధర్‌కర్ నామరూప నానా.

సిహర్ ఉఠే పులకిత హో ద్రుమదల్,
సుప్త సమీరణ హువా అధీర్,
ఝలకా హాస్ కుసుమ అధరోం పర్
హిల్ మోతీ కా సా దానా.

సృష్టిగర్భమును చీల్చి బయటపడి
బహురూపులు రాత్రించరులు
కాంతిలహరికల నవరోధింపగ.
కట్టుచుండి రదె ప్రాకారాలు

నిశాయాసభర నిర్గత విభయై
ముఖముదాచికొను శశిబాల;
కమలక్రోడమ్మున అళిఖై దీ:
శోకకోక ముత్పన్నాదది.

జడము చేతనము సర్వమ్మేకము,
జగము స్తబ్ధమై మూర్ఛిలెను :
శూన్యవిశ్వవక్షమ్మున కేవల
నిశ్వాసోచ్ఛ్వాసలె నడచెను

ప్రథమమ్ముగనీవే, బహుదర్శిని !
ప్రభాతగీతము పాడితివి,
సుకముల, సిరులను- సురపథచారిణి !
ఒక మాలికగా నల్లితివి.

నిరాకారమగు తిమిరము వెలసెను
సాకారముగా వెలుతురులో,
నానానామమ్ముల రూపమ్ముల
కానుపించె జగతీజాలములో.

ద్రుమదళములు పులకితమై కదలెను,
సుప్తసమీరము చలించెను,
పుష్పాకరముల హాసము మెరసెను
ముక్తాయుత హిమకణములతో.

ఖులే పలక్, ఫైలీ సువర్ణ ఛవి,
జగీ సురభి, డోలే మధుబాల్,
స్పందన్ కంపన్ లొ, నవ జీవన్
సీఖా జగ నే అప్నానా;

ప్రథమ రశ్మికా ఆనా రంగిణి.
తూనే కైసే పహచానా ?
కహాఁ కహాఁ హేబాల విహంగిని !
పాయాయహ్ స్వర్గిక గానా ?

విరిసెను కన్నులు, వెలసెను వెలుగులు
సురభులుసాగెను, భ్రమరము లూగెను
స్పందన కంపన నవజీవనముల
సకల జగమ్ములరాగెను.

తొలివెలుతురు గోల రాకలనెటు
తెలిసితివే ? వ్యోమసుందరంగీ !
నిరాయాసముగ సురలగానమెటు
నేర్చితివె ? బాలసుందరంగీ !

అనువాదము : శ్రీ దాశరథి

---



# కవీంద్ర కే ప్రతి

గీత్‌శిల్పి, తుమ్ జాగృత భారత కే కవి బన్‌కర్
ఆయే, అధరోం పర్ వైష్ణవజన కీ బంశీధర్,
తన్మయ, మధువర్షిణీ, రహస సుఖ దుఖ భయకాతర్,
ప్రీతి సాధనా నిరత, త్యాగ అనురాగ ద్రవిత స్వర్.

కౌన్ విరహిణీ నారీ థీ వహ ఉర్ మేం గుంఠిత్
జిస్‌నే కవి కీ మూక వేదనా కీ రస ఝంకృత్
అంతః స్పర్శీ భావోంమేం, ఛందోంమేం అగణిత్ ?
నిశ్చయ్, మానవ్ కీ ఆత్మా, యుగ యుగ సే శాపిత్.

కవి ! తుమ్‌నే ఇంద్రియ నిషేధకర్, జీవన వర్జన్,
ముక్తి నహీం మాంగీ, చాహా వైరాగ్య న సాధన్,
బర్సాకర్ మానస వైభవ కా భోర్ రత్న-ధన్
రసపావస్ మేం కియా ముగ్ధ కేకీవత్ నర్తన్.

రాజహంస శ్రీ ఫుల్ల సరోరుహ సర కే కూజిత్,
తుమ్ జీవన కే అంతస్తల మేం పైఠే నిశ్చిత్,
అంతర కీ నిస్తల గహరాయీ ఖోజ్ అపరిమిత్
లాయే బహు మణిగణ్, ముక్తాఫల, ఆత్మజ్యోతిస్మిత్.

కవే ! పూర్వ పశ్చిమ కా కర్ సాంస్కృతిక సమన్వయ్
బంధుభావ్ సే మానవ్–మానవ్ కా పా పరిచయ్,
విశ్వప్రేమ మేం భూఖండోం కా కర్ నవ పరిణయ్
మానవతా కా లాయే తుమ్ జగ మేం అరుణోదయ్ !

భారత్ కే నిరవధి మానస కా కర్ యుగ మంథన్
నిఖిల విశ్వ కే చిదైశ్వర్య కే ప్రతి అతి చేతన్

# ఓ కవీంద్రా!

★ ★

తాదృశ వైష్ణవమ్ముదల ద్యాగము రాగము ప్రీతి భీతియున్
మోదము ఖేదమున్ మదము మ్రోయగ పిల్లనగ్రోవి మోవిపై
స్వాదు రస స్వరావళిగ సత్కవివై జపివైన గీత శి
ల్పి ! దయ చేసితే కనులువిచ్చిన భారత భూతధాత్రికిన్

చిరవిరహార్తి దగ్ధయయి చేడ్పడి లోమదిడాగి వేదనా
భరహృదయమ్ము మేల్మొసుగు బాగొనరించి విచిత్రవక్ర సుం
దర బహుభావ భంగిమ లతాపరిఫుల్ల సువృత్త గీతముల్
పరవశ యౌచు బాడు నవలా చిరశస్త నరాత్మయే జుమీ . .

కోరపు మోడులట్మ్రి బ్రతుకుం బొనరింతు వసంతు రంతు-నీ
లో రసవర్షనేశ పొరలున్ మెయివెల్గు కవి ! నటింతు పృ
థ్వీరమ పొంగ గేకివలె విప్పి విదిర్చుచు చిత్రరత్న సం
భార విభాఘనాఘనము మానస వైభవ బర్హభారమున్ . .

చెదిరిన జీవ సంతతుల జీవన గాథములన్ మునింగి లో
మదిమది జొచ్చి తెచ్చెదవు మానికముల్ తెలిమంచి ముత్తెముల్
బ్రదుకవియెల్ల జల్లెదవు పల్కున వెల్గు చిదాత్మ చిర్నవుల్
మదకలగుంజ ! శ్రీజలజ ! మానస జీవన రాజహంసమా !

కడు గడగండ్ల ఖండములుగాబడి పిడ్వడి యున్న తూరుపుం
బడమర లొక్కతీరు నడవన్ నవసంస్కృతి మార్గ కర్తవై
యెడనెడ హత్తి ప్రేముడుల నేకము సేయగబూని లోకపున్
బడలిక తీర్ప వెచ్చితివి మానవతా నవతారుణ ప్రభల్ . .

మనసరి ! భారతీయజన మానసగాథములన్ మథించి నీ
వు నిఖిల విశ్వ చిద్వైభవ పూర్ణమహస్సుల వెల్గి మేటివై

విశ్వకవే ! తుమ్ జిస్ మానవతా కే ప్రతినిధి బన్
ఆయే ! వహ్ ఖోచుకీ హై, మానుష్య పరమధన్ !

వైష్ణవ ఉర్ కే భూతదయా కే ప్రతి అతి నిర్మమ్,
జన–వికాస ప్రతి పంగు నాశ-హిత దారుణ సక్షమ్,
మృత్ ముట్ఠీ మేఁ లియే ధ్వంస వహ్, జీవిత అణుబమ్,
విగత సభ్యతా స్వప్న మనోజీవీ యుగ కా భ్రమ్ !

ఘోర హ్రాస్! చేతసరత్, జడ ఉపరత్ ఋషి భారత్
బ్రహ్మసత్య బహురూపజగన్మిథ్యా జిస్ కా మత్
తన్ మన్ ధన బలహీన ఆజ్, వృథ్ ఆత్మ తేజ గత్
రూఢి రీతి మత సంప్రదాయ శతఖండిత, శ్రీహత్ !!

మహానాశ్: భౌతిక వైజ్ఞానిక సత్యప్రకాశక్,
దేశకాల పర్ జయీ, తడిత అణుబల ఉద్ఘాటక్,
ప్రకృతి ప్రశాసక్, అర్థశక్తి కే బస్ ఆరాధక్,
శిబిరోం మేఁ సంఘటిత ఘోర సర్వస్వ వినాశక్

కవే! అచేతన హిల్లోలేఁ ఉఠ్తీ కిలోల్ కర్,
మత్త భుజంగోం సీ తృష్ణా మణిఫణి సహస్రధర్,
తమ కే పర్వత ఉఠ్తే కల్మష కే శిఖరోం పర్
లిపటా జిన్ సే యుగ ప్రభాత హేమాస్య హాస్యధర్

ఆందోలిత అవచేతన, ఉలట్ గయా తమసాగర్,
బిఖరే మణిగణ రత్న, అతల్ జల్ కే ముక్తాకర్,
గ్రాహ్, సర్ప, ఘోంఘే, కృమి, కర్దమ్ ఛాయే ఊపర్,
భూమన్ కా ఆమూల్ హోరహా నవరూపాంతర్.

మనిచిన మానవత్వ మది మాటువడెన్ బయిలోడి నేడయో
చనినది వెల్గు చీకటుల సవ్వడులే వినవచ్చు నే యెడన్....

భూతదయా విహీనతలు భూజన నాశవిలాస వై ఖరుల్
రోత జనించు దారుణపు ద్రోవల బోవగ నిచ్చగించుటల్
నీతి విహీన సభ్యతలు నేర్చెను నేటికి మానవుండు తా
భూతలమృత్యుహాస్త్రముల బుచ్చుకొనెన్
పరమాణుకాస్త్రిముల్
(భూతలమెల్ల స్వప్నమయముం బలె దోచును భ్రామకంబుగా)

పిలచిన మృత్యువే పలుకు పెద్దగ నయ్యది యట్టులుండ, తో
ల్పలుకులు పల్కినట్లుగనె బ్రహ్మము సత్తు జగత్తు మిథ్యగా
దెలిసిన యార్షభారతము దేహ మనోధృతి దార్ఢ్యశూన్యమై
కలగి గతాత్మ తేజమయి కాటికి గూటికి గాక మౌఢ్య శృం
ఖలలకు జిక్కి చెన్ను చెడి కంతల బొంతగ మారెనో కవీ...

గండంబుం గనిపెట్టెరా భువికి విజ్ఞాన ప్రబుద్ధుండు సత్
ఖండజ్యోతి తటిల్లతా ప్రగతి జేతంబట్టి యణ్వాస్త్రముల్
పిండెన్, దేశము గాలముంబ్రకృతి కంపింపన్, ధనారాధనా
పాండిత్యంబున గూటముల్ నిలిపి సర్వధ్వంస హింసార్భటిన్

జడతాసుందరి చేదు నాగసరపున్ సన్నాయి నొక్కంగ వే
పడగల్ విప్పి భుజంగివోలె మణి శోభం దృష్ణ నర్తింపగా
ముడిచీకట్లనిటారుగొండ కలుషంపుంగొమ్ము పై కెత్త బై
బొడిచెఁ నేటి యుగంపు నెమ్మొగమునం బ్రొద్దుల్ జగానవ్వులన్.

అవచైతన్యము కుబ్జ మౌట తిమిరాహంకార పాథోధి యు
ద్దవిడిం గ్రిందయి మీదునై చెలగ యాదస్సంతతుల్ రెచ్చి, చి
ర్నవులం దంష్ట్రలు చూప ముత్తెములు రత్నంబుల్ పటాపంచగా
భువి సర్వంబు సమూలముగ మరల రూపుల్ క్రొత్తలై తోచెడిన్.

ధరాయోని సే అగ్నిస్తంభ్ ఉఠ్‌తా తేజోజ్వల్
అతల కూప సే నగ్నరూప జగతా తమ కా బల్;
లౌహాలు దండ వహ్ దీప దేహధర్ జనమన సంబల్,
సూర్య ముకుట్ సిర్ పర్, ప్రభాతఛవి స్మిత దిఙ్మండల్ !

ఆజ్ దూల్ మేఁ, సోయీ అంధీ, రక్త మేఁ తడిత్,
ఓర్ ఛోర్ జన భూకే అగ్ని ప్రవాళ ప్రజ్వలిత్;
దైన్య దుఃఖ దారిద్ర్య,-యుగోం కే ప్రేత్ పరాజిత్,
అఖిల అసుందరతా భూ ప్రాంగణ్ సే నిర్వాసిత్

ప్రాణోం కా ఆవేశ సహస్ర ఫణోం పర్ నర్తిత్,
పంగు పక్ష పీడిత, గతి-కుంఠిత నైతికతా మృత్;
కామ, అంధ, తమసాణు తరంగ విద్యుత అహివేష్టిత్ !
శూన్యనీల శ్రీ హరిత, స్వర్ణపావక ఉర సించిత్ !

కనక కిరణ భూగయీఁ ధరా తమ కీ గహ్వర్ కో,
జ్యోతి సేతుమేఁ బాంధ్ విరోధోం కే అంతర్ కో;
పావ్త కరే భూ మన్ సుందర సే అతి సుందర్ కో
ఖండ సత్య సే పూర్ణ సత్య, శివ సే శివతర్ కో !

మగ్న అచేతన కర్దమ మేఁ భూ జీవన్ శతదల్
ఉసే ఉఠా, కర్ సకే కలుష కా ముఖ తుమ్ ఉజ్వల్ ?
మానవతా కీ సిద్ధి న విశ్వ సమన్వయ కేవల్,
ఊర్ధ్వ గహన పూర్ణత్వ, లక్ష్య హీ మేఁ జన మంగల్ !

క్యా సోచా థా ? నరక స్వర్గ హీ కా లఘు ఉపక్రమ్,
జాగేగా సోయా ప్రకాశ జో ధర్‌తీ కా తమ్;

ధరణీగర్భము జీల్చుకొంచశిల ఛుక్స్పంభాయిత జ్వాలలు
ప్వరమున్ ముట్టదమస్సు దిస్స మొుల సల్పన్ నాట్యముల్ భూమి గ
హ్వారమందాయస దండముల్ నిలువ దీవ్యద్దేహముల్ దాల్చి, భూ
నర మేదస్సుకు సంబళంబుగ గనంగా దోచె బ్రాగ్దీధితుల్....

ధూళిస్నిద్దురగూర ఝుంఝులు తటిత్తుల్ రక్తముంబార, బ్రా
వాళజ్వాలలు సాప్త జిహ్వలు కకుబ్భాగంబులన్ నాక, దు
ష్కాలోదస్భృత దరిద్రతల్ దొలగె దుఃఖంబుల్ పరాభూతమై
నేలం గూలె నసుందరమ్ముఖిలమున్ నీల్గెన్ యుగ ప్రేతముల్....

ప్రాణజనమ్ము వేల్పదగలన్ పయి కెత్తి నటించుచుండగా
ద్రాణనశించి నీతి స్పృహాతప్పిపడెన్ తిమిరాంధవాసనా
స్థాణువుపుట్టి, విద్యుదహి, దర్పము జూపగ శూన్యమున్ వారి
చ్ఛోణ వినీల చిత్రరుచి శోభిలు వహ్నిసువర్ణ ధారలన్ . .

అంధతమసము పట్టిన యనవనికిపుడు
మొనసి పడి దాకె వచ్చి కాంచనగభస్తి
శాంతి చెడి నీడ్చబడిన మానసాంతరముల
జ్యోతిరుజ్జ్వల సేతువుల్ జోక గట్టె

నరుడు సుందరము గని సుందరతరమ్ము
శివముగొని యందుపై బోయి శివతరమ్ము
ఖండ సత్యము బొంది యఖండ సత్య
మందుచుం బోవుగానుత మవని నెపుడు....

మరుగగు దొంగయూబి దిగమారిన మానవు జీవనాబ్జమున్
తిరిగి వెలార్చి పుల్గడిగి తేరిచి చెన్నలరింపు నేర్పగున్

రాశి బనేగీ గుణ, గుణరాశి, విషమ హోగా సమ్,
చేతన ఓర్ కరేగా జడ ఆరోహణ్ నిరుపమ్ !

ఆంఖ్ మూందే జో జడ వహ్ ఆంఖ్ ఖులే పర్ చేతన్,
ధోతా ఆజ్ ధరా తమజన ప్రాణోంకా ప్లావన్;
మహాకవే! యుగపలకోం పర్ ఫూలా నవసావన్,
దిగ్విరాట్ నవ మనుష్యత్వకా దివ్య స్వప్నబన్.

దేఖ్ రహా మైం, ధూమ జ్యోతి కా రుద్ర సంఘటన్
వజ్ర దశన్, సంఘర్ష సఘన, విద్యుత అసికేతన్,
విశ్వక్రాంతి సందేశ లియే భరతా గురు గర్జన్,
శత హీరక్ మాణిక్ దీపిత అద్భుత మరకత ఘన్ !

గరజ్ రహీ దిగ్దుందుభి, ఛిట్‌కా అగ్ని బీజకణ్
ప్రాణహరిత నవజీవన మూల్యోం కా కర్ వితరణ్;
జడచేతన, ఆత్మా తన్ మన్ కార్యర్ధ విభాజన్,
మూల్యభ్రాంత, కవి, రహా యుగోం సే జీవన దర్శన్ !

జీవన సే సంయుక్త రహీ జన కర్మ వచన మన్,
జీవన సత్య అఖండ్ కరేగా మార్గప్రదర్శన్
సింధు హరిత ఛవి, నీలదిగంచల కనకగౌరతన్
భూ జీవన లక్ష్మీ కే ప్రతి హో పూర్ణ సమర్పణ్.



నరతకు సిద్ధి కేవలము నాకును నీకు విభేద భావముల్
తలుగుట కాదు నింగి కెగ బ్రాకుటబో శుభతంతు సంతతుల్ ....

నరకము స్వర్గసృష్టికయి నాందిగ నెంచితొ భూతమస్సు ని
ద్దురబడియున్న కాంతియని తోచెనొ యేమొ సమష్టి సద్గుణా
భరణముగా దలంచితివొ ప్రస్తరముల్ జలధార లౌచు ని
స్సరణము సేయునంచు మనసారగ నమ్మితొ వేదమానిసీ

కన్నుల మూతయౌ జడము కన్విరివిప్పులఁ జేతనమ్మ, యు
త్పన్న ధరాముఖాంధ తమసంబు నదల్చును ప్రాణవాహినుల్
గ్రన్నన నో కవీశ యుగకామిని కన్గుద దొల్కరించు బ్రా
పృణ్ణవ నీరదంబు పృధివి నవ మానవు పైడి స్వప్నమై. .

క్రించనరాని విద్యుదసి కేతన మెత్తుచు, వజ్రదంష్ట్ర తా
టించుచు ధూమరుద్రత నటించుచు మించుచు, జ్యోతిరక్షి కా
న్పించుచు, గ్రొత్త వెల్గు వినిపించుచు, నార్చుచు వచ్చె క్రాంతి, కాం
త్యంచిత హీరహార పరమాద్భుత గారుడ రత్న మేఘముల్ ....

చైతనోజ్జ్వల వహ్ని బీజముల నుచ్చైరోపలం జిమ్మి యీ
చేతమ్మున్ జడ మాత్ర దేహ మని నిక్షేపించు మౌర్ఖ్యమ్ము, ది
గ్వ్యాత ప్రాంగణ దుందుభుల్ మొరసి వహ్వాయంచు హాసించు తా
నేతజ్జీవన మైక్య దర్శనము కాదేయంచు వాక్రుచ్చెడిన్ . .

బ్రదుకును నంటి యుండదగు బల్కులు కర్మలు నెమ్మనంబు నీ
బ్రదుకు నఖండ సత్యమయి పండి యెరుల్ గనుత్రోవ జూపి ప్రా
గుదధి హరిచ్ఛవుల్ జిలుక నూర్ధ్వ దిగంచల నీల గౌర శో
భఁదనరు భూమిలక్ష్మి పదపద్మ సమర్పిత మౌత సర్వమున్ .

అనువాదము : శ్రీ రాచకొండ నరసింహామూర్తి

★ ★

# అనంగ్

అహో విశ్వ అభినయ కే నాయక్ !
అఖిల సృష్టి కే సూత్రధార్ !
ఉర్ ఉర్ కే కంపన మేం వ్యాపక్ !
ఐ ! త్రిభువన కే మనో వికార్ !
ఐ ! అసీమ సౌందర్య సింధు కీ
విపుల వీచియోం కే శృంగార్
మేరే మానస కీ తరంగ మేం
పునః అనంగ ! బనో సాకార్

ఆది కాల మేం బాల ప్రకృతి జబ్
థీ ప్రసుప్త, మృతవత్, హతజ్ఞాన్,
సస్య శూన్య వసుధా కా అంచల్,
నిశ్చల జలనిధి, రవి శశి మ్లాన్;
ప్రథమ హాస్ సే, ప్రథమ అశ్రు సే,
ప్రథమ పులక సే, హే ఛవిమాన్ !
స్మృతి సే, విస్మయ సే తుమ్ సహసా
'విశ్వ స్వప్న' సే ఖిలే అజాన్

# అనంగుడు ★ ★

ఓ యనంగ నా హృదయ రంగమున
ఉదయింపగ గ్రొమ్మెను గైకొనుము
హే విశ్వమయాభినయ కుశీలవ!
ఇదం జగ త్సృష్టి సూత్రధారా...
హృదయ హృదయ సంస్పందన విస్ఫుమర
మృదుల మధుర కటుచటుల వికారా!
హే యనంత సౌందర్య మాధురీ!
హృదూర్మిమాలాఖిల శృంగారా!
ఓ యనంగ నా హృదయ రంగమున
నుదయింపగ గ్రొమ్మెన వెలుంగుము...

తొలి యుషస్సు క్రొవ్వెలుగు జూపుటకు
దొలి చీకటులే చిమ్మియుండు తఱి,
ప్రకృతి సమస్తము నిదుర గూడు తఱి,
పడి మృతవలె హతమతిగ నుండు తఱి,
వసుధ శూన్యసస్యాంచలయగు తఱి,
వనధి కదలికలు లేక యుండు తఱి,
వే వెలుగొక్కడు వెలుగు లేని తఱి,
వెలవెల చలి వెలుగున్న నాటి తఱి,
తొలి క్రొన్నగవుల దొలి కన్నెకల
దొలి పులకల దులకించు క్రొవ్వెలుగ
స్మృతి వలె విస్మయగతి వలె ప్లుతి సం
సృతికి స్వప్నభృతి విరియునో, స్మరా!
ఓ యనంగ నా హృదయ రంగమున
ఉదయింపగ గ్రొమ్మెను గైకొనుము...

ఝూల్ జగత కే ఉర్ కంపన్ మేం,
పులకావలి మేం హైఁస్ అవిరామ్,
మృదుల కల్పనావోం సే పోషిత్,
భావోం సే భూషిత అభిరామ్;
తుమ్‌నే ఖారోం కీ గుంజిత్ జ్యా,
కుసుమోం కా లీలాయుధ్ థామ్,
అఖిల భువన కే రోమ్ రోమ్ మేం,
కేసర్ శర్ భర్ దియే సకామ్।

నవ వసంత కే సరస స్పర్శ సే
పులకిత వసుధా బారంబార్
సిహర్ ఉఠీ స్మిత సస్యావలి మేం
వికసిత చిర యౌవన కే భార్ ;
ఫూట్ పడా కలికా కే ఉర్ సే
సహసా సౌరభ్ కా ఉద్గార్,
గంధ ముగ్ధ హో అంధ సమీరణ్
లగా థిరకనే వివిధ ప్రకార్ ।

అగణిత వాహ్ పథా ఉదధీనే
ఇందు కరోం సే ఆలింగన్
బదలే, విపుల చటుల లహరోం సే
తారోం సే ఫేనిల చుంబన్;
అపనీ హీ ఛవి సే విస్మిత్ హో
జగతీ కే అపలక్ లోచన్
సుమనోం కే పలకోం పర్ సుఖ సే
ఝరనే లగే సలిల మోచన్

విశ్వహృదయ మృదుమధుస్పందమున
నిశ్వసించి దృశ్యాంతరంగమున
పులకాందోళిక నూగియూగి నగి తెలి
లలిత కల్పనల గొనికొని క్రొంజిగి
తలపు బూనగల తొలి సింగారి!
వలపుటనికి బూవిల్లు చేత గొని
టంకరించి భ్రమరజ్యాఝుంకృతి
ఠింకమ్మున త్రిభువన హృదయమ్ముల
నాటి నాటె కుంకుమ పువ్వుటమ్ముల
నాటితి వంతట గెల్పుకంబములు...

విరిసె దొలుత నీ కంట నామనులు
మురిసె బదింబడి మూడు భువనములు
చిలకరించె జిర్నగవ్రలు పొలములు
గిలిగిలించె బిసిబిసి జవ్వనములు
డుసికిలి విసిరి విరిసె నెత్తావులు
మిసమిసి పస బూమొగ్గల తావులు
ఉక్కిరి బిక్కిరి కమ్మ తెమ్మెరలు
గ్రక్కదలెం బలుతెరగుల పరుగులు...

కడలి పొంగి తరగల వే చేతుల
నొడికి దీసె శశి శిశువుం బ్రీతుల
స్రుక్కిసోలి చంచల తరంగములు
రిక్కల కిడె నురుగుల చిరుముద్దులు
రిచ్చవడుచు తన సొగసు సోగలకు
రెప్పార్పక జగమేదో లో గులుకు
ఎఱుపులూరు పూరేకు రెప్పతుద
మెఱుగువారు కన్నీరు కార్చునెద...

సౌ సౌ సాంసోంమేం పత్రోం కీ
ఉమడీ హిమజల సస్మిత భోర్,
మూక విహగ కుల కే కంఠోం నే
ఉఠీ మధుర సంగీత హిలోర్;
విశ్వ విభవసీ దాల ఉషాకీ
ఉడా సుసహరి అంచల్ ఛోర్,
శత హర్షిత ధ్వనియోం సే ఆహత్,
బనా గంధవహ సథ కీ వోర్.

శూన్య సిరాహోం మేం సంస్కృతి కీ
హులవా విచారోం కా సంచార్,
నారీ కే గంభీర హృదయ కా
గూఢ రహస్య బనా సాకార్ ;
మిలా లాలిమా మేం లజ్జా కీ
ఛిపా ఏక నిర్మల సంసార్,
నయనోం మేం నిఃసీమవ్యోమ 'జా'
ఉరోరుహోం మేం సురసరి ధార్ !

అంబుధి కే జల మేం అథాహ ఛవి
అంబర మేం ఉజ్జ్వల ఆహ్లాద్,
జ్యోత్స్నా మేం అపనీ అజానతా,
మేఘోం మేం ఉదార సంవాద్ ;
విపుల కల్పనామేం లహరోంమేం,
తరుఛాయా మేం విరహ విషాద్,
మిలీ తృషా సరితా కీ గతి మేం,
తమ మేం అగమ, గహన ఉన్మాద్.

చిగురుటాకు నిట్టూర్పు సవ్వడుల
నగె జల్లని తొలి సంజ చిన్నెల
మూగవడిన విహంగమ్ముల గళముల
మ్రోయసాగె సంగీత మధురిమలు,
ఉషఃకుమారీ స్వర్ణచలాంచల
ముప్పిర మెగిరెను విశ్వవిభవ కళ
హర్షోన్మద మాధురీ నాద ము
తృష్ణ మై గంధవాహు డేచగ...

జగచ్ఛాన్య శిరలందు పొంగులై
సాగె భావభావములు రంగులై
నారీ గభీర మానసమున, సా
కారమయ్యె చిరగూఢ రహస్యము
సిగ్గు దొంతరల కెంపుకులతో
ముగ్గి దాగె నేదో నవసంస్కృతి.
కన్నదోయి లోతెరుగని మిన్నులు
చన్నదోయి మిన్నేటి పెల్లుబు...

నిండి నిబిడమై యవకుంచె నీ
గండు చూపు తాకంగ దస్పకా!
అంబుధి జలముల నగాధ శోభలు
అంబరముల నాహ్లాద ధ్వనులు
జ్యోత్స్నె హృదిని చిరమొగ్గ్ల గంధములు
జ్యోతిసుదరముల సంవాదమ్ములు
సరిల్లహరులన్ సవ్యకల్పనలు
తరుచ్ఛాయలన్ విరహ వేదనలు
సరిద్గతులలో తృషాభాషణలు
సంతమసమునం గూఢోన్మాదము...

మృగియోంనే చంచల అవలోకన్,
ఔ, చకోర నే నిశాభిసార్,
సారస్ నే మృదు గ్రీవాలింగన్
హంసోం నే గతి, వారి విహార్;
పావస్ లాస ప్రమత్త శిఖీ నే,
ప్రమదా నే సేవా, శృంగార్,
స్వాతి తృషా సీఖీ చాతక్ నే,
మధుకర్ నే మాదక్ గున్ జార్

శూన్య వేణు ఉర్ సే తుమ్ కితనీ
ఛేద్ చుకే తబ్ సే ప్రియ తాన్,
యమునా కీ నీలీ లహరోం మేం
బహా చుకే కితనే కలగాన్;
కహాం మేఘ్ ఔ, హంస్? కింతు తుమ్
భేజ్ చుకే సందేశ అజాన్,
తుడా మరాలోం సే సుందర ధను
జుడా చుకే తుమ్ అగణిత ప్రాణ్

లేళ్లు క్రేళ్లురికి బెదరుం జూపులు
రేల జకోరము లభిసరణమ్ములు
సారసములు గ్రీవాలింగనములు
వారి యలల గలగలల చిర్నడలు
మత్తశిఖులు ప్రావృడ్లాస్యమ్ములు
మధుకరములు మదభర కల రుతములు
కలహంసలు నడకల యొయారములు
తెలిసి నేర్చెనో యామని నెచ్చెలి
వలపు పేలుపా తలపుల పిలుపా
వలపు తలపు చదువుల బడి యొజ్జా...
ప్రమదామణి సేవా పరిచర్యలు
బ్రదుకు వెలుగు శృంగార మాధురులు
స్వాతికార్తె చిఱువెలుగు మసకలో
చాతకములు దప్పిక గొంన నేర్చెను...

పాడి పాడి పిల్లంగ్రోవి యెడందల
పూరించితి మధు సరస రాగములు
యమునా నీల నీల లహరులపై
దమిదేలించితి మధుర రాగములు
అంబువాహమో హంసరాజమో
అంపించితి విరహుల సందేశము
మరాళమాలా ! ధనుర్భంగముల
మరులుగొల్పి రక్షించితి వసువుల...

జీవన కే సుఖ దుఃఖ సే సురభిత్
కితనే కావ్య కుసుమ సుకుమార్,
కరుణ కథావోం కీ మృదు కలియాఁ—
మానవ ఉర్ కే సే శృంగార్—
కితనే ఛందోం మేఁ, తాళోం మేఁ,
కితనే రాగోం మేఁ అధికార్
ఫూట్ రహే నిత్, అహే విశ్వమయ్ !
తబ్ నే జగతీ కే ఉద్గార్.

విపుల కల్పనా సే, భావోం సే,
ఖోల్ హృదయ కే సౌ సౌ ద్వార్,
జల, థల, అనిల, అనల, నభ సే కర్
జీవన్ కో ఫిర్ ఎకాకార్,
విశ్వమంచ్ పర్ హాస అశ్రు కా
అభినయ దిఖలా బారంబార్,
మోహా యవనికా హటా కర్ దియా
విశ్వ రూప తుమ్‌నే సాకార్ :

హే త్రిలోకజిత్ ! నవ వసంత కీ
వికచ పుష్ప శోభా సుకుమార్
సహమ్, తుమ్హారే మృదులకరోం మేఁ,
ఝుకీ ధనుష సీ హై సాభార్:
వీర్ ! తుమ్హారీ చితవన్ చంచల్
విజయ ధ్వజా మేఁ మీనాకార్
కామినీ కీ అనిమేష నయన ఛవి
కర్తీ నిత నవబల సంచార్,

బ్రదుకు వెలుగునీడల పరిమళములు
బహుళ కుసుమ సుకుమార కావ్యములు
కరుణాగాథల మృదుల ముకుళములు
తరుణహృదయ మధుశృంగారమ్ములు
బహుళ తాళముల బహుచ్ఛందముల
బహుళ రాగముల బాడె నీ జగతి
కామదేవ! నీ యభావ భావము
కాదగు నొక యీ విశ్వోద్గారము..

సరసకల్పనల మధుర భావముల
దెరచి హృదయ శతశత ద్వారములు
అనలానిల జల భూతల నభముల
బెనచివైచి జీవన మొక రూపుగ
అశ్రుహాసముల విశ్వరంగమున
నభినయించి చూపించి సారెకును
మోహ యవనికల నెత్తివైచి స
మ్మోహన విశ్వైక్యాకృతి నిల్పెదు.

త్రిలోక జేతా! తొలి వసంతమున
పులకరించి విరిసిన పూ బరువుల
సిరుల విల్లు నీ మృదుల కరమ్ముల
నెదిగి వంగె జుంటి తేనె బరువుగ
మిలమిల మీనై గెలుపు కంబమున
తళుకు జిలికి నీచూపు కైపుగా
మత్తకామినీ నయనచ్ఛవులకు
క్రొత్త బలుపు జత జేర్చు వలపుగా

బజా దీర్ఘ సాంసోం కీ భేరీ,
సజా సటే కుచ కలశాకార్,
పలక్ పాఁవడే బిఛా, ఖడేకర్
రోవోంమే పులకిత ప్రతిహార్
బాల యువతియాం తాన్ కాన్ తక్
చల్ చితవన్ కే బందనవార్,
దేవ్ ! తుమ్హారా స్వాగత కర్తీఁ !
ఖోల్ సతత ఉత్సుక దృగ ద్వార్.

ఐ ! త్రినయన కీ నయనవహ్ని కే
తప్త స్వర్ణ ! ఋషియోం కే గానా !
నవజీవన్ ! షడ్ఋతు పరివర్తనా !
నవరసమయ ! జగతీ కే ప్రాణ్ !
ఐ ! అసీమ సౌందర్య రాశి మేఁ
హృత్కంపన్ సే అంతర్ధాన్ !
విశ్వకామినీ కీ పావన ఛవి
ముఝే దిఖావో, కరుణావాన్,

పీనకుచమ్ముల కనక కలశముల
బీత రాగ చర్చల నమర్చుకొని
అదరి బెదరు వాల్గన్నుల రెప్ప తుద
లడుగడుగునకును మడుగు లొత్తగొని
ఊర్పు సందడుల భేరీస్వరితము
నుండి యుండి పరిమళించి మొరయగ
దెరచి సముత్సుక దృగ్ద్వారమ్ములు
తిగిచి కట్టి యాకర్ణాంతమ్ముగ
వలపు బూల చూపుల తోరణములు
నిలిపి నిలిపి పులకల ప్రతిహారుల
స్మర దేవా ! స్వాగత మని యందురు
తరుణీ జనములు భయ సంభ్రమముల . .
ఆహాహా తిగకంటు మంటలకు
నారితేరి యలరిన జగదానందా !
జగత్ప్రాణమా నవజీవనమా !
సరసోషశ్శ్రీ సహాస మయమా !

ఋషిజన హృదయ ముకుళ పరిమళమా !
ఋతునర్తన ! ఋతుపరివర్తనమా !
అంతరహిత సౌందర్య మాధురీ
స్వాంత తరంగిత కిలికించితమా
విశ్వకామినీ హాసన శోభలు
వేగ జూప రావో కరుణామయ . . .

అనువాదము ; శ్రీ రాచకొండ నరసింహామూర్తి

★ ★ **కూర్మాచల కే ప్రతి**

జన్మభూమి, ప్రియ మాతృభూమి హే శీర్షరత్న. శత స్వాగత్.
హిమ సౌందర్య కిరీటిత జిసకా శారదమస్తక్ ఉన్నత్.
ఉషా రశ్మిస్మిత, స్ఫటిక శుభ్ర, స్వర్ణిమ శిఖరోంమేం ఉత్కర్

పుణ్యధరా కే స్వర్గోన్ముఖ సోపానపంథ్ సా విస్తృత్
నిజ అవాక్ గరిమా సే కర్తా సబ అమరోంకో మోహిత్,
నిఖిలవిశ్వ కో దిగ్విరాట్ భౌగోళిక విస్మయ సే భర్ :

బాల ప్రవాసీ ఘుమకర్ లౌటా, యహా థీ క్యా అభ్యాగత్ ?
స్నేహ ఉచ్ఛ్వసిత, హేమంత పులకిత అంచల కా శరణాగత్.
మేరీ నైసర్గిక సుషమా మేం జనని, సదా సే లాలిత్,

హాసముఖ ఛాయాతప సే గుంఫిత శ్యామ గౌర్ జిసకా తన్,
శ్రీ శోభా స్వప్నోం సే నిర్మిత గీత భృంగ గుంజిత మన్,
రంజిత అనిల సౌరభ పలనే మేం దోలిత శైశవ ముకులిత్.

# కూర్మాచలము ★ ★

స్వాగతము స్వాగతమ్ము మజ్జనన భూమి !
మాతృభూమి శిరోరత్నమా ! శత శత
వందనములు, కూర్మాచల వందనములు ...
శారదాచ్ఛ చంద్రోచ్ఛ్రితమ్ము నీ హి
మాచ్ఛ సౌందర్య మకుటము లవియు, నీ యు
షోగథసి స్థానములనియు, యోగము యోగ
లనగ సింగిడి తెర ప్రాంతి యమునొన శిఖ
రములు స్వర్గ సోపాన సిరుల పొడమిరి ...

పుణ్యధాత్రి పరాయత ముగ్ధ కరణి
నేం పెరిపి సింగ కెరసి నిండినట్టి
నీ యశస్సు— సురభిమ్ము— నిఖిల విశ్వ
విస్మయావహ మూర్తిక చిత్రమాను
నీ హిమాద్రుల గోరుల భాస మొంబ ....

బాల్యమున విడి పోయిన ప్రవాసముండి
చెలగి నీ యొడి చేరిన శిశువు నమ్మ
నేను నభ్యాగతుండను గాను, నీవు
పరసువులకిష్ట వస్తుపాంచలము కోర
వెండి కరుణన్న కరుణానసుండగాని.

నీదు నైసర్గిక శ్రీల నాడు లాల
నమ్ము పాలనమ్ము జరిగె నమ్మ, నీదు-
వెలుగునీడల నన్నోల. వెలుగు నీడ
తీసె నా మేను, నీ సిరు లేలు కలలు
కన్న గీత భృంగములు నాగళము మనసు
మాధురీ శీధువుల్ నింపి మనిచె నన్ను
నీదు నెత్తావి యూయెల నాదు ముకుళ
శైశవమ్ము తెమ్మెర లూపసాగె నమ్మ ..

ఛుట్‌పన్ సే విచరా హూఁమైఁ ఇన్ ధూపఛాఁహ శిఖరోం పర్,
దూర్, క్షితిజపర్ హిల్లోలిత సీ దృశ్య పటీ పర్ నిఃస్వర్
హల్కీ గహరీ ఛాయావోం కే రేఖాంకిత సే పర్వత్.

నీల, వేగినీ, కపిశ, పీత, హరితాభ్ వర్ణ శ్రీ ఛహరా
మోహిత అంతర్ మేఁ భర్ దేతే ఆదిమ విస్మయ గహరా,
అంతరిక్ష విస్ఫారిత నయనోం కో అపలక్ రఖ్ తద్వత్.

ఊపర్, సీపీ కే రంగ్ కా నభ, నవ ముక్తాతప సే భర్,
రజత నీలిమాగలిత్, సహజ హఁసతా సా లగ్తా సుందర్,
ఊంచే ఉస్ సేవాలే! నిర్జల, కౌశ మసృణ, రోమిల్ ఘన్

చూర్ణ రుపహలీ అలకోంమేఁ ఉలఝా రవికిరణేఁ ఉజ్వల్
మౌన ఇంద్రధనుషీ ఛాయా కా స్వప్న నీడ్ రచ్, చంచల్
ఉడ్‌తీ-చితవన్ కే ఖగకో బందీకర్ లేతే కుఛ్ క్షణ్.

విజన ఘాటియోంపర్ చఢ్‌కర్ శిశు మేషోం-సే దుగ్ధోజ్వల్
చిత్రగ్రీవ హిమ కే ఘన పల మేఁ హోతే నభమేఁ ఓఝల్.
పావస్ మేఁ జబ్ మిహికా మేఁ లిపటా రహతా గిరిప్రాంతర్

వెలుగు నీడల ముగ్గుల వెలుగు మలుగు
శృంగరంగాంగణమ్ముల బొంగి తిరుగు
బాల్యమున గంటి మిన్నులు పడ్డచోట
గదలి కదలక చూసినట్లు గన్న కట్టు
దృశ్య నీరవతాంకిత దృశ్య పటము-
గూఢ గాఢ రేఖాంకిత కుధరములును
హరిత పీత నీల కపిశాహర్మ్య శోభ
లంబకంబంత జృంభించి నంబు పీలు
అంతరిక్ష పెన్నె చూచి కన్నార్ద్రకాండు
అది యనాది విస్మయమయి సృష్టిదికి నిండు ...

శుక్తి సుందర గగనమ్ము శుద్ధ మౌక్తి
కాశపఙ్క్తులు నింప శుభాంగివోలె
సహజ సంనక్షత్రమై యొప్పు సహారహమ్ము ...

ఎగసి యుప్పర వీథుల కెగురు క్రౌంచ
మస్తక ఘనహారి సూర్య బింబాల కిరణము
లను రజత చూర్ణ మృదుకుంతలముల దురుము
కొనుచు నింద్రచాప శిఖల బెనిచి స్వప్న
పంజరమ్ముల బవరించి నటి జేయు
వల చపల దృగ్విభాగముల స్ఖలిత గతుల ...

అంతలో ప్రాప్య దేశ్య హిమాంబుదములు
పాల నురుగుల మేనుల గ్రాలు గొత్త
పిల్లగా కడుపు వలె నోర బెట్టి మెడ లో
యేపు నడల గిరి చలియలకు ప్రాకి
మాయమైపోవు పొగమంచు మాటు జేరి

క్షణము తడయక ఇంతలో శైలగుహాల
సింగముల మాడ్కి జృంభించి చెలగి రేగి
మెఱుపు జూల్దులిపి యురిమి కురిసిపోవు
చలియలం గాల్చు నవల విధురులు గిరులు ...

శైల గుహావోంమేం దహాడ్తే సింహోం సే జగ్ క్షణ్ మేం
దుహరీ తిహరీ తాడిత శృంఖలా టకరాతే ఘన తనమేం,
బర్ సాకర్ ఆగ్నేయ సానువోంసే స్ఫులింగ కే నిర్ఝర్ !

షడ్ ఋతుయేం సురబాలావోంసీ కరతీం నవ్ ఘన్ నర్తన్.
వాసంతీ కిసలయ కితనే హీ రంగ్ బదల్తే పరివర్తన్,
రజతతామ్ర, పాటల పల్లాశీ, హరిత పీత శ్యామ కంపిత్.

సలజ మౌన్ ముకులోంమేం ఖిల్ సా అస్ఫుటిత విభవ్
పూలోంకే అంగోం కీ ఆభా పీ ఉడ్ ప్రియ యౌవన్
ఉడ్తీ పర్వత ఘాటీ సౌరభ పంఖోంమేం రోమాంచిత్ !

ఉచ్చప్రసాదోంమేం లేటా, ఛాయా మర్మర్ ... ,
శ్రాంత పాంథ్‌సా గ్రీష్మ ... భర్ మధ్యాహ్న్ మేం దిన్ !
పాగుర్ కర్తే వృష ... శైల వృషభవత్,

కాలే పడ్తా తిగ్మ ధూప సే కురంగ తర్హైటీమేం రంగ్,
కూటోంపర్ లిపటా రహతా సితాతప మేఘోం కే సంగ్,
ఛారవాయు హిమ జలద పంఖ్‌సా పంబర్ ఝులాతీ అవిరత్ !

ఆదిమహత్తా పశు జగ కీ అబ్ భీ బన్ కర్తే ఘోషిత్,
సింహఋక్ష్ వృక గిరి ఖోహోంకో రఖ్తే భీత నివాసిత్,—
చకిత, చౌకడీ భీత మృగోంపర్ ఝపట్ టూట్తే నాహర్ !

శ్వేత నీలకాలే ఉపలోంసే కంఠ వృషోంకే భూషిత్,
భేదోంకే ఘంటీ సే రహతేఁ గిరి డగరేఁ కలగుంజిత్,
ఉచ్చశాద్వలోం సే ఛనౌతే చరవాహోం కే మురళీస్వర్ !

సుఘర్ కృషక బంధుయేఁ నితఖేతోంమేఁ సోనా ఉపజాతీఁ,
కంఠ మిలా జన కే సంగ్ కృషి కే గీత హుడుక్ పర్ గాతీఁ,
త్యోహారోంమేఁ నాచ్‌గాన రంగోం కే రచ బహుల ఉత్సవ్ !

నీలారుణ కిరణోంమేఁ పలతే స్వస్థ సౌమ్యనారీనర్
గౌర కపోలోంమేఁ ఉషా కీ లాలీ లియే మనోహర్ ,
లజ్జారుణ లగ్తీఁ జిస్ సే అజ్ఞాత యౌవనాయేఁ నవ్

నీదు పాదాల నిలచిన నిభృత వనులు
పశు జగత్తునకు ననాది ప్రాప్తమైన
స్వీయ సత్తను ఘోషించు జెలగి పేడు
గొండ గుండెలు దద్దిర్ల గోండ్ర పెట్ట
జేరి తోడేళ్లు నెలుగులు సింగములును . . .

క్రేళు లురికి తడంబడి తూలి పారు
జారు లేళ్లపై బులులు పంజాలు పెట్టు . . .

తెలుపు నలుపు నీలంపు బూరెల పి[illegible]
డల కొయ్యారములు మలచి [illegible]
పలుక బెనురంకె లిడు వృషభసమ్ము[illegible] . .

మెడల చిరుగంట సవ్వడుల్ మేళవించి
గిరుల త్రోవలు మొరయించు గోజీయ[illegible] . .

సానుభూముల నోములు శాద్వలములు
బసులకాపర్ల వేణువుల్ పాడుచుండు . .

కర్షక వధూకరస్పర్శ గన్న బీళ్లు
పసిడి ముత్యాల పంటలు పండుచుండు
మురటు మగవాని కంఠముల్ మ్రో[illegible]
బోలము పాటలు పడుచులు కలిసిపాడ
పండుగల నాళ్ల కృష్యుత్సవమ్ము లిచట
నృత్య గీతమ్ములందెల్చి నెరపు చుండ్రు . .

అరుణ నీలార్ద్ర కిరణమ్ము లందు బెరిగ
స్వస్థ సౌమ్యా నారీ నర సంఘ మిచట . .

జిలుగు కెంపుల చల దుపశ్శ్రీలు చింది
ముగ్ధయౌవనా గౌర కపోల పాళి
లలిత లజ్జారుణము నాగ దోలకరించు . .

ఉగ్ర కరాల శిలాయేఁ భర్ తీఁ మన్ మేఁ విస్మయ సంభ్రమ్,
ఘోర అంధేరీ గహరీ దరియోఁ మేఁ బసతా ఆదిమ తమ్,
స్ఫీతనాద భర్ బహతే బహతే-జల-స్తంభోం-సే నిర్ఝర్ ।

నిబిడగహన మేఁ సహసా జగ్ మగ్ జల్ ఉఠ్ తే పట్ బీజన్
హింస్ర వ్యాఘ్ర కే విస్ఫారిత హరితాభ భయావహలోచన్,-
సంకరీ ఘాటీ మేఁ సర్పోం-సే స్రోత్ సరక్తే సర్ మర్.

ఝీనే కంపిత నీల కుహాసోం సే పరివృత హో సత్వర్
బృహత్, గరుత్ సా ధస్ తా నభ మేఁ పంఖ మార్ గిరి ప్రాంతర్,
అర్ధదృశ్య గంధర్వ లోకసా, ఛాయాపథ మేఁ శోభిత్,

భ్రూవిలాస్ కర్తీఁ చపలాయేఁ, మందహాస కర్ ప్రతిక్షణ్,
ముగ్ధ వలాకోఁ కే సంగ్ ఉడ్ తా నభ మేఁ ఇచ్ఛుకుల్ మన్;
చీర్ బాష్పపట్ కఢ్ తా శశి సా రవి, కిరణోంసే విరహిత్.

యహ్ భౌతిక ఐశ్వర్య శుభ్ర గరిమాసే మన్ కో ఛూకర్,
నీరవ ఆధ్యాత్మిక విస్మయ సే అంతర కో దేతా భర్.
ఏక మహత్ గుణ అన్యగుణోఁ కో కర్తా నిత ఆకర్షిత్

వ్రేలి నిల్చిన యుగ్ర కరాళ శిలలు
తిర మిరవుగొను దరుల నాదిమ తమస్సు
ధీర నాదార్భటుల్ సేసి తిన్నబాటి
నిలిచె నాగ సంభ స్తంభ నిర్ఝరములు
జలుపు నెడదల విస్మయ సంభ్రమములు . .

గహన విపినాన బచ్చ్ఛజగా వెలుంగు
మంటనా మండు బెబ్బులి కంటి జిగులు . .

ఇరుకు లోయలలో సెలయేళ్లు జారు
రిక్కి జరజరం బ్రాకు సర్పిణుల భంగి . .

నీలి పొగమంచు దరికొని నింగి తెగయు
రోద సిందూరపుర బృహద్గరుత్ము పోవు
నాగ- రెక్కలల్లార్చుచు నగమె యెగిరె
నాగ- గంధర్వలోకము నాగ సుందు
ద్రాక్ష్యతాప్రశసంగ్రహించిన దరుగు చుండి . .

క్షణము క్షణమున నంపహాసములు చేసి
చపల లూరించు ఘూపిలాసముల చేసి . .

ఆలసంబడి ముగ్ధ బలాకల కను
నభమునం దేలిపోవు మనస్సు సతము . .

పంచుకొనివైచుకొను బొగమంచు జిలుగు
నంత తిగ్మ గభస్తి శీతాంశు వసును . .

గుడికి గోప్పురపు పసిడి కుండపోలె
భౌతికైశ్వర్య గరిమ విభూతి యేదో
ఆత్మ సంస్పర్శనాధ్యాత్మి కాద్భుతమ్ము
నెడద నింపు- నిజము తన యిచ్చ జేయు
నన్యగుణముల నొక్క మహద్గుణమ్ము . .

జగజీవనతాం క్రందన ఘోషణ హో జాతా తుమ్ మేం లయ్,
జగతా ప్రాణోం మేం అనంత భావోం కా వైభవ అక్షయ్,
ఊర్ధ్వారోహీ మౌన శాంతి మేం భూమన్ కో కర్ మజ్జిత్.

అబ్ మైం సమఝ్ సకా మహత్వ ఇన్ శిఖరోంకా స్వర్గోన్నత్,
నిస్సీముక్తి మేం సమాధిస్థ హో అంతర్నభ మేం జాగ్రత్-
స్ఫూర్తిసే శాశ్వత ప్రహరీ-సే అంతరిక్ష మేం శోభిత్.

జహాం పద్మసోపానోం పర్ వైరస్య విచరతా పావన్,
స్వర్ణిమ ఆభాఓం మేం ఉడ్తా అపలక్ శోభామేం మన్,
ఉచ్చ నభస్థల మేం రహతా సంగీత అనశ్వర్ గుంజిత్





# మహాత్మాజీ కే ప్రతి

నిర్వాణోన్ముఖ ఆదర్శోం కే అంతిమ దీప శిఖోదయ్ !
జినకీ జ్యోతి ఛటా కే క్షణ నే ప్లావిత ఆజ్ దిగంచల్,—
గత ఆదర్శోం కా అభిభవ హీ మానవ ఆత్మా కీ జయ్,
అతః పరాజయ ఆజ్ తుమ్హారీ జయ సే చిర లోకోజ్జ్వల్ !

మానవ ఆత్మా కే ప్రతీక్ ! ఆదర్శోం సే తుమ్ ఊపర్,
నిజ ఉద్దేశ్యోం సే మహాన్, నిజ యశ సే విశద చిరంతన్,
సిద్ధ నహీం, తుమ్ లోకసిద్ధి కే సాధన బనే మహత్తర్,
విజిత ఆజ్ తుమ్ నర వరేణ్య, గణజన విజయీ సాధారణ్.

యుగ యుగ కీ సంస్కృతియోం కా చున్ తుమనే సార సనాతన్,
నవ సంస్కృతి కా శిలాన్యాస కర్నా చాహా భవ శుభకర్,
సామ్రాజ్యోం నే ఠుకరా దియా యుగోం కా వైభవ పాహన్—
పదాఘాత సే మోహ ముక్త హోగయా ఆజ్ జన అంతర్ !

దలిత దేశ కే దుర్దమ నేతా, హే ధ్రువ, ధీర, ధురంధర్,
ఆత్మశక్తి సే దియా జాతి-శవ కో తుమ్నే జీవన బల్;
విశ్వ సభ్యతా కా హోనా థా నఖశిఖ నవ రూపాంతర్,
రామరాజ్య కా స్వప్న తుమ్హారా హువా న యోం హీ నిష్ఫల్ !

వికసిత వ్యక్తివాద కే మూల్యోం కా వినాశ థా నిశ్చయ్,
వృద్ధ విశ్వ సామంతవాద కా థా కేవల జడ ఖండహర్;
హే భారత కే హృదయ్ ! తుమ్హారే సాథ్ ఆజ్ నిఃసంశయ్,
మూర్ఛ హోగయా విగత సాంస్కృతిక హృదయ జగత కా జర్జర్ !

# మహాత్ముడు ★ ★

నిర్వాణోన్ముఖ! సురుచిర-పూర్వాదర్శ ప్రదీప- పుం దుది శిఖవై
పర్వంజేసితి జ్యోతులు-సర్వదిగంచలములందు క్షణిక స్ఫురణన్...
ఆదర్శమ్ములు నాటివి-కాదని జనమనము మీద గాంచిన జయమే
నీదు పరాజయమై న-వోదయ రాగమ్ము లీనె నుర్వీస్థలికిన్....

ఆదర్శముల కందనట్టివాడవు మానవాత్మప్రతీకుండ వగుచు నీ మ
హానుభావమె నిన్ మహాత్మునిగా జేయ నల్లుకొంటివి కీర్తి వల్లికలను
సిద్ధుండవై కాదు సిద్ధికి సాధన భూతుండవై వెల్గు బూసినావు
నిను గెల్చుకొనియె మందిని గెలిపించితి హతుడవై యమృత
జీవితుడవైతి
యుగయుగమ్ముల సంస్కృతులొడిసి యొక్క నూత్నసంస్కృతి
పుడమికినూలుకొల్పి
రాజ్యములు త్రోసిరాజను ప్రాజ్యవిభవశిలను బడదూశిచే మేలు
కొలిపినావు

పొడ్వడు దేశమున్నడపు భవ్యదురంధర! యో యుగంధరా!
కాడ్వడి యున్న జాతి కొక గాటపు టూపిరిపోసి, సభ్యతల్
కీడ్వడు కర్మభూమిని రగిల్చి, దిగంచల సర్వసంస్కృతుల్
తోడ్వడ రామరాజ్య మెపలో గలగంటివి కల్ల యెట్టులా....

తీగలు సాగు వ్యక్తి వసంతము నశించె
సామంతయుగపు గ్రీష్మము గతించె
తొలినాళ్ల యాదర్శములు సంస్కృతులు ముక్క
చెక్కలై రూపముల్ చెదరి పోయె.
వర్గాత్మక సమాజ దుర్గముల్ నేల మ
ట్టమ్ము లౌచు సమతలమ్ము లయ్యె.
మనుజమాత్రుని బందగొను స్వర్ణ శృంఖలల్
తెగత్రెంపులై విముక్తి గనుపట్టె

గత సంస్కృతియోం కా, ఆదర్శోం కా థా నియత పరాభవ్,
వర్గ వ్యక్తి కీ ఆత్మా పర్ థే సౌధ ధామ జినకే స్థిత్,
తోడ్ యుగోంకే స్వర్ణపాశ అబ్ ముక్త హో రహా మానవ్,
జన మానవతా కీ భవ సంస్కృతి ఆజ్ హో రహీ నిర్మిత్ ।

కియే ప్రయోగ్ నీతి సత్యోంకే తుమ్‌నే జన జీవన పర్,
భావాదర్శ న సిద్ధ కర్ సకే సామూహిక-జీవన-హిత్;
అధోమూల అశ్వత్థ విశ్వ, శాఖాయేం సంస్కృతియాం పర్,
వస్తు విభవ పర్ హీ జనగణ కా భావ విభవ అవలంబిత్ ।

వస్తు సత్య కా కర్తే భీ తుమ్ జగ మేం యది ఆవాహన్,
సబ్ సే పహలే విముఖ తుమ్హారే హోతా నిర్ధన భారత్,
మధ్య యుగోం కీ నైతికతా మేం పోషిత శోషిత-జనగణ్,
బినా భావ స్వప్నోం కో పరఖే కబ్ హో సక్తే జాగ్రత్ ?

సఫల్ తుమ్హారా సత్యాన్వేషణ, మానవ సత్యాన్వేషక్ !
ధర్మ, నీతికే మాన్ అచిర సబ్, అచిర శాస్త్ర, దర్శన మత,
శాసన, జనగణ-తంత్ర అచిర,-యుగ స్థితియాం జినకీ ప్రేరక్,
మానవ గుణ, భవ రూపనామ హోతే పరివర్తిత యుగపత్ !

పూర్ణపురుష ! వికసిత మానవ తుమ్, జీవన సిద్ధి అహింసక్ !
ముక్త-హుయే-తుమ్-ముక్తహుయే-జన్, హే జగవంద్య మహాత్మన్ !
దేఖ్ రహే మానవ భవిష్య తుమ్ మనశ్చక్షు బన్ అపలక్,
ధన్య, తుమ్హారే శ్రీ చరణోం సే ధరా ఆజ్ చిర పావన !

నీవు జీవన పథముగ నీతి సత్య
ముల ప్రయోగించితివి గాని పూర్ణసంఘ
మునకు వలయు భావాదర్శమును గడించి
చివురు పట్టించుటయె యుపేక్షించినావు..
విశ్వమధోమూలం బగు
నశ్వత్థము సంస్కృతులు మహోయత శాఖల్
శాశ్వత వస్తుబలంబున
విశ్వజనీనంపు భావ విభవము వెలయున్..

అవులే వాస్తవవస్తురూపము ప్రయోగార్థంబుగా బూని యుం
డు వయేనిన్ నిలుపేద భారతము జేడున్ మ్రింగునో, మధ్య కా
ల విభానానుభవమ్ము గొన్న జనముల్ భావోన్మద స్వప్నముల్
జవిగా కెట్టులు మేలుకో నగు నహింసా సత్యనిత్యవ్రతా!

ధర్మము నీతి శాస్త్రములు దర్శనము
మతమ్ము శాసనము స్వతంత్రము లవి.
స్థిరములే, కాలాను స్వృతములై ప్రకృతి
గుణంబులు పరివర్తనములు గొనవె
జోహారు నీ పరిశోధనమున కహింసా వ్రతా!
నీ సత్య సాధనమ్ము
పూర్ణమ్ము పూర్ణరూపుండవు పురుషోత్త
ముడవు జీవన సిద్ధి పొందినావు

ముక్తుడవు నీవు, నీప్రజల్ ముక్తులైరి
సాక్షిభూతమంతశ్చక్షు వగుచు నేటి
కరయుచుందువొ నరుభవిష్యమ్ము, పుడమి
పండూడెను నీ పద స్పర్శనముల..

అనువాదము: శ్రీ రాచకొండ నరసింహామూర్తి

★ ★

# ద్వా సుపర్ణా

దో పక్షీ హైం: సహజ సఖా, సంయుక్త నిరంతర్
దోనోం హీ బైఠే అనాదిసే ఉసీ వృక్షపర్
ఏక్ లే రహా పిప్పల్ ఫల కా స్వాద్ ప్రతిక్షణ్,
బినా అశన్ దూసరా దేఖ్‌తా అంతర్లోచన్.
దో సుపర్ణోం - సే మర్త్య అమర్త్య సయోనిజ హోకర్
భోగేచ్ఛాసే గ్రసిత, భటక్‌తే సిపే డగర్,
సదా సాథ్ రహా, లోకలోకమేం కర్తే విచరన్
జ్ఞాతమర్త్య సబ్‌కో, అజ్ఞాత అమర్త్య చిరంతన్

రహీం నహీం క్యా పక్షీ? జో చఖ్‌తా జీవనఫల్
విశ్వ వృక్ష పర్ సిర్, దేఖ్‌తా భీ హై నిశ్చల్.
పరమ అహం జో ద్రష్టా భోక్తా జిస్ మేం సంగ్ సంగ్,
పంఖోంమేం బహిరంతర కా సబ్ రజత స్వర్ణరంగ్.
ఐసా పక్షీ, జిసమేం హో సంపూర్ణ సంతులన్
మానవ బన్ సక్తా హై, నిర్మిత కర్ తపజీవన్.
మానవీయ సంస్కృతి రచ భూపర్ శాశ్వత శోభన్
బహిరంతర జీవన వికాస కీ జీవిత దర్పణ్.
భీతర్ బాహర్ ఏక్ సత్య కే రే, సంపూర్ణద్వయ్,
జీవన సఫల ఉడాన్, పక్ష సంతులన్ జో, విజయ్

—

# ద్వా సుపర్ణా

★ ★

కలదు పక్షుల జంట సఖ్యమ్ము వానిది చిరతరమ్ము
విడనిదియు చెడనిది వసించు నదె సనాతనిగ
నదే చెట్టు పైన నందొకడు రావిపండు చవిఁదినుచునె యుండు.
మరి యొకడు ప్రవాసముండి సతము చూచుచుండు నిశ్చలత లో
చూపు లలర.

నెచ్చెలులయి జంట విడక, నిచ్చలుండి మర్త్యము సమమర్త్యమగు
రూపము పుట్టుకొనుచు భోగవాంఛ దవిలి జగంబుల దిరుగుదురు.
గతి క్రిందుగ మీదుగ పోవను లమర.
జ్ఞాతుడా మర్త్యుడేరి కజ్ఞాతు డగు-
చిరంతను డమర్త్యు డగు వా డనంతుడగుట.

విశ్వవృక్షమ్మునం గూడు విడిసియుండి
జీవితఫలము మెసవి రుచిగొనుచు
తిరమున నునికి పరమాత్మమ్ము నగుచు
నగుచు భ్రష్టుయున్ భోక్తయుంగూడ తాన యొకడె
రజతమయుమైన బాహ్యావర్ణమ్ము విప్పి,
స్వర్ణమయమైన లోకి పక్షమ్ము విద్రిచి
పక్షముల రెంట నిలుపుచు పరము నరుత మానవుడు కాగలడు పక్షి
మనగలడు తనువు నీవనము నెరప నవును
శాశ్వతమును సుభగమును నయి యాదర్శమయిన సంస్కృతి
పుడమి పయి నిల్పజాలు.

సర్వ మానవులకు లోన బయటం బ్రదుకు తెలివి
వెల్గ బరమునౌ సత్యమ్ము విప్పిచి విచ్చి
నవియె యీ రెండు పక్షములని యెరుక గలుగును లోకమునకు..
సఫలోద్గతియె బ్రదుకు విజయమౌ సమస్థితి తోడుతోనె . .

అనువాదము: శ్రీ రాచకొండ నరసింహామూర్తి.



# శ్రీ అరవింద కే ప్రీతి

ఆజ్ జబ్ కి నీరస అసార్ విశ్రీ లగతాజగ- జీవన్,
జీవన కా సౌందర్య ఫూల్‌సా ముర్‌ఝా రహాసురభి-క్షణ్,
బిసర్‌గయా జబ్ సతరంగ్ బుద్బుద ఉర్‌కా స్వప్నఅచానక్,
జీవన సంఘర్షణ నే లోహిత, గయే మర్త్య కే నగ ఝక్
జీర్ణ యుగోం కీ నైతికతా జబ్ కర్తీ జనమన శోషణ్
క్షుద్ర అహం కీ దాసీ బన్, స్వార్థీకో కియే సమర్పణ్
అంతర్విశ్వాసోం కే ఉన్నత శృంగ రహే ఢహ్ ఢాపర్
సూఖ్ గయా చిరస్రోత ప్రేరణా కా ఉర్ హువా అసుర్వర్

ఆజ్ జబ్ కి మన్ ప్రాణ ఇంద్రియోంకే క్షత విక్షత అంగ్ అంగ్
పునః చాహతీ వే గతిలయమేఁ బంధనా దేవోంకే సంగ్
ధ్వంస భ్రంశ హోగయే విగత ఆదర్శోం కే జబ్ ఖండహర్
కుచల్ రహా మానవ ఆత్మా కో జడ భౌతిక ఆడంబర్.
ఆజ్ జబ్ కి బుఝ్ గయీ చేతనా అంధకార నే ఉర్ భర్,
చూర్ణ హోగయా హృదయ సభ్యతా కా, నీరవ సంస్కృతి స్వర్

తుమ్హే పుకార్ రహా తబ్ అంతర్, భావీ మానవ ఈశ్వర్
నవ్యచేతనా, నవమన్, నవజీవన కా భూ కో దో వర్.
స్వర్ణచేతనా,ద్రవిత జలద తుమ్, రజిత తడిత రుచిస్పందిత్,
రత్నచ్ఛాయ సజల్, రహస్యప్రభ, శతశత సురధను మండిత్,
దివ్య ప్రేరణావోం కీ జగమగ్ కిరణోంసే చిరగుంఫిత్,
మనస్ పంఖ్ మేఁ జ్వలిత అమర పిండోం కో కియే తిరోహిత్,

# అరవిందయోగి ★ ★

ప్రపంచ జీవనం అసారంగాను నీరసంగాను ఉన్న ఈనాడు
జీవితసౌందర్యం పుష్పం వలె వాడివత్తలైన ఈనాడు
సప్తవర్ణబుద్బుదం వంటి స్వప్నం అకస్మాత్తుగా విడిపోయెను
జీవన సంఘర్షణతో మానవుడు అలసి పోయెను
గత యుగాల నైతికత క్షుద్రమైన అహంతకు దాసియై
జన మనమ్ములను చాలా ఘోరంగా వేధించెను.

అంతర్విశ్వాసమ్ముల ఉన్నత శిఖరమ్ములు కూలి నేల రాలెను
చిర చైతన్య స్రోతస్విని ఎద లోపల ఇంకి పోయె
ఈనాడు మనస్సు ప్రాణం ఇంద్రియములు సమస్తం
మళ్లీ దేవతల వలె లయ గతులతో ఇమిడి పోవ జూచును.
వగతాదర్శాల అవశేషాలు ధ్వంసమై భ్రంశమై పోయెను
భౌతికాడంబరాలతో మానవుడు ఆత్మను కలచి వేసెను
అంధకార బంధుర హృదయంలో చైతన్యం మలిగి పోయె
సభ్యత నలిగి దుమ్మైపోయెను, సంస్కృతి స్వరం నీరస మయ్యెను

మనస్సు నిన్ను పిలుస్తున్నది రా భావి మానవేశ్వరా !
నవ చైతన్యము, నవ మనస్సు నవ జీవనము ప్రసాదించమని,
రజత్ తటిత్ రుచి స్పందిత సువర్ణ చైతన్య జలదమ నీవు
సజల సప్రభ శత శత సురధనుర్ మండిత జలదమ నీవు
నీవు దివ్య చైతన్య కాంతి కిరణాలలో గుంఫితుడవు.

స్వర్మానస సే ఉత్, ఉతరో, అబ్, జనమన కే శిఖరోంపర్
సూక్ష్మ చేతనా బాష్పకణోం మేఁ లిపటా మానవ అంతర్.
నవజీవన శోభా మేఁ బరసో, కహో ధరాముఖ సస్మిత్,
అమృత చేతనా కే ప్లావన మేఁ మర్త్య లోకకర్ మజ్జిత్.
హే అతిచేతన్, నవమానసరసనోంమేఁ హోకర్ ఘూషిత్
నవ ఆదర్శ బనో తుమ్, జిస్ మేఁ నవజీవన హో బింబిత్.
జీవన మన్ సే ఊపర్ తుమ్ నవజీవన మేఁ నవమన్ మేఁ
మానవతా కో బాంధో అభినవ ఐక్యముక్తి బంధన్ మేఁ

స్వర్గము నుండి బయలు వెడలి దిగిరా జనమనశ్శిఖరాల మీదకు
మానవ మనస్సు బాష్పకణాలతో ప్లావితమై యున్నది
నవజీవన వర్షం కురిపించుము, ధరిత్రిని నవ్వింపుము
మానవ శోకమ్మును అమృతచైతన్య ప్రవాహంలో ముంచుము
ఓ అత్యుదాత్తచైతన్యమూర్తీ! నూతన మనో వసనాలతో
భూషితుడవై
నవజీవనం బింబించే నవాదర్శమూర్తివి కమ్ము!
అభినవైక్య ముక్తి బంధనలో మానవతను బంధింపగ రమ్ము!

అనువాదము ; శ్రీ దాశరథి.

---

# పర్వత ప్రదేశ మేం పావస్

పావస్ ఋతు థీ, పర్వత ప్రదేశ్,
పల్ పల్ పరివర్తిత ప్రకృతి వేశ్,
మేఖలాకార పర్వత అపార్
అప్ నే సహస్ర దృగ సుమన ఫాడ్,
అవలోక రహా హై బార్—బార్—
నీచే జలమేం నిజ మహాకార్,
జిస్ కే చరణోంమేం పలా తాల్
దర్పణ సా ఫైలా హై విశాల్.

గిరికా గౌరవ గాకర్ ఝర్ ఝర్ మదమేం నస్ నస్ ఉత్తేజిత కర్
మోతీ కీ లడియోం-సే సుందర ఝర్ తే హైం ఝాగ్ భరే నిర్ఝర్.
గిరివర కే ఉర్ సే ఉఠ్ ఉఠ్ కర్ ఉచ్చాకాంక్షావోం—సే తరువర్
హైం ఝాంక్ రహే నీరవ నభ పర్, అనిమేష, అటల, కుఛ్ చింతా పర్
ఉడ్ గయా, అచానక్ లో భూధర్, ఫడకా అపారవారిద కే పర్,
అవశేష రహ గయే హైం నిర్ఝర్. హై టూట్ పడా భూపర్ అంబర్
ధస్ గయే ధరామేం సభయశాల్ ఉఠ్ రహా ధువా, జల్ గయా తాల్
యోం జలదయాన మేం విచర్, విచర్ థా ఇంద్ర ఖేల్ తా ఇంద్రజాల్.

(వహ్ సరలా ఉస్ గిరి కో కహతీ థీ బాదల్-ఘర్)

ఇస్ తరహ్ మేరే చి తేరే హృదయ్ కీ
బాహ్య ప్రకృతి బనీ చమత్కృత చిత్ర థీ;
సరల శైశవ కీ సుఖద సుధి సీ వహీ
బాలికా మేరీ మనోరమ మిత్ర థీ

# పర్వత ప్రదేశంలో వర్షం



పర్వత పరిసరముల వర్షర్తువు
వచ్చిరావాలె వికసింపగ ప్రకృతి తనువు.

మేఖలాకార పర్వత పంక్తి తన
సహస్ర నయనాలతో చూస్తున్నది
పాదప్రాంతంలో పరచుకొన్న తటాక జలంలో
తన మహాకార ప్రతిబింబమును.

గిరి గౌరవమును గానము చేస్తూ
ఝరి వేగముగా ప్రవహించినది
గిరివర వక్షస్థలమున పుట్టిన
తరువులు గగనముపై చూపుంచెను.

రెక్కలాడించె జలధరములు గగనాన
భూధరములెగసి పోయె, వచ్చె వాన
మిన్ను వచ్చి మన్నుపై దూకె
అన్ని దెసల జలధారలు ప్రాకె.

భయముతో సాలములు భూమిలోకి క్రుంగె
తటాకాలు తగులబడె, పొగ దశ దిశల క్రమ్మెంగె
మేఘ వాహానమెక్కి వచ్చి ఇంద్రుడు
మేదిని పై చేసినాడు ఇంద్రజాలము.

నా కళా హృదయాన నూతనమగు
చిత్రములు వ్యాపించె, పొంచె
సరళ శైశవ నవ స్మృతి వలె
"సరళ" నా మనోహర మిత్రము.

కొండను 'సరళ' మబ్బుటిల్లు అనేది.

అనువాదము: శ్రీ దాశరథి

కిన్ తత్వోంసే గఢ్ జావోగే తుమ్ భావీ మానవ కో ?
కిస్ ప్రకాశ సే భర్ జావోగే ఇస్ సమరోన్ముఖ భవకో ?
సత్య, అహింసా సే ఆలోకిత హోగా మానవ కా మన్?
అమర ప్రేమకా మధుర స్వర్గ బన్ జాయేగా జగజీవన్?
ఆత్మా కీ మహిమా సే మండిత హోగీ నవ మానవతా?
ప్రేమశక్తి సే చిర నిరస్త హోజాయేగీ పాశవతా ?

బాపూ ! తుమ్ సే సున్ ఆత్మా కా తేజరాసి ఆహ్వాన్
హాఁస్ ఉఠతే హైఁ రోమ్ హర్ష సే, పులకిత హోతే ప్రాణ్
భూతవాద ఉస్ ధరా స్వర్గ కేలియే మాత్ర్ సోపాన్,
జహాఁ ఆత్మ దర్శన అనాది సే సమాసీన అమ్లాన్
నహీ జానా, యుగ వివర్త మేఁ హోగా కితనా జన క్షయ్,
పర్, మనుష్యకో సత్య అహింసా ఇష్ట రహేంగే నిశ్చయ్.

నవ సంస్కృతి కే దూత్! దేవతావోం కా కర్నే కార్య
మానవ ఆత్మాకో ఉబార్నే ఆయే తుమ్ అనివార్య.



భవిష్య మానవునే గుణాలతో పరికించెదవో బాపూ!
సమరోన్ముఖ ధరణీ తలమును ఏకాంతులతో నింపెదవో!
మానవ హృదయం సత్యాహింసల మహిమ నెరింగేనా!
జగజ్జీవితం నవ ప్రేమతో రస స్వర్గమై పోయేనా!

నవమానవ గుణమాత్మ మహిమతో నందిత మయ్యేనా?
ప్రేమశక్తితో పశు స్వభావం నిరస్తమయ్యేనా?

విని నీ పిలుపును ప్రాణికోటి ఆనందముతో పొంగారునుతే
రోమరోమ మున్సాహముతో పులకాంకితమై వెలుగొందునుతే
ధరణి స్వర్గమై తనరుట కొరకు సోపానమేగే భౌతికవాదము
ఆత్మదర్శనస్ఫూర్తి అన్యూనముగా సమాసీనమై ఉండవలెనుతే.

యుగ పరివర్తనలో ప్రాణిక్షయ మెంతయగునో ఎరుగను గానీ
సత్యాహింసలపై మానవునికి మక్కువ కలుగుట తథ్యము
నవ సంస్కృతి దూతవు నీవు సురాలయ వాసుల వలె
మానవాత్మనుద్ధరించుటకునై మహికేతెంచితివో బాపూ!

అనువాదము: శ్రీ దాశరథి



# జీవన కా శ్రమ తాప హరో, హే!

జీవన కా శ్రమ తాప హరో, హే!
సుఖ సుఖమా కే మధుర స్వర్ణసే
సూనే జగ గృహ ద్వార భరో, హే!

లౌటే గృహ సబ్ శ్రాంత చరాచర్,
నీరవ తరు అధరోం పర్ మర్మర్,
కరుణానత నిజ కర పల్లవసే
విశ్వ నీడ్ ప్రచ్ఛాయ కరో, హే!

ఉదిత శుక్ర, అబ్ అస్త భాను బల్!
స్తబ్ధ పవన, నత నయన పద్మదల్,
తంద్రిల పలకోం మేం నిశి కే శశి!
సుఖద స్వప్న బన్ కర్ విచరో, హే!



# జీవన తాపం హరింపుమా! ★ ★

జీవనతాపం హరింపుమా! ప్రభు
శూన్యమైన నా గృహద్వారమున
సుఖసుషమా నవకాంతి నింపుమా!

అలసి సొలసి ఇలు చేరె ప్రాణితతి,
నీరవ తరువుల పెదవులపై రుతి!
కరుణానతమగు నీకర తలమును
ధరణీ నీడముపై చాపగదే!

అర్కుడు క్రుంకెను. శుక్రుడు వెలసెను
నతనయనాబ్జము, స్తబ్ధము పవనము
మత్తుగొన్న నిశి నయనమ్ములలో
మధు స్వప్నమై సంచరింపుమా!

అనువాదము: శ్రీ దాశరథి



# తపరే మధుర మధుర మన్

తపరే మధుర మధుర మన్
విశ్వ వేదనామేఁ తప ప్రతిపల్,
జగ జీవన కీ జ్వాలామేఁ గల్,
బన్ అకలుష! ఉజ్వల. ఔ, కోమల్,
తపరే విధుర విఘుర మన్!

అపనే సజల స్వర్ణసే పావన్
రచ జీవన కీ మూర్తి పూర్ణతమ్,
స్థాపితకర్ జగమేఁ అపనా పన్,
ఢల్‌రే ఢల్ ఆతుర మన్!

తేరీ మధుర ముక్తి హే బంధన్,
గంధ హీన థా, గంధయుక్త బన్,
నిజ అరూపమేఁ భర్ స్వరూప్, మన్!
మూర్తిమాన్ బన్, నిర్ధన్!
గల్ రే గల్ నిష్ఠుర మన్!



# తపము చేయుము

తపము చేయుము మధుర చేతమ్మ, నీవు
విశ్వవేదనలలోన జీవిత జ్వాల
లో సమర్పించుకొమ్ము సముజ్జ్వలా క
లుషము కోమలమగును లే లోకమెల్ల.

ఆర్ద్ర సువర్ణముచే నాత్మ జీవ
న ప్రతిమ పూర్ణతమముగా సుప్రతిష్ఠి
తమ్మొనర్చి, ఆతుర హృదయమ్మ, జగము
నందు తన తనమ్మును నిల్పు.

నిష్ఠుర మనమ్మ బంధమ్ము నీదు ముక్తి
గంధ హీనవు సౌగంధకాత్వమందు
మాత్మ — నీ రూపమున స్వరూపావధిగను
సేయుమది మూర్తి మంతమ్ము చిత్త !

అనువాదము: శ్రీ దండమూడి మహీధర్



* *

# లోగీ మోల్?

లాయీ హూఁ ఫూలోంకా హాస్,
లోగీ మోల్, లోగీ మోల్?
తరల తుహిన వనకా ఉల్లాస్
లోగీ మోల్, లోగీ మోల్?

ఫైల్ గయీ మధుఋతు కీ జ్వాల్,
జల్‌జల్ ఉఠతీఁ వనకీ డాల్;
కోకిల కే కుఛ్ కోమల బోల్
లోగీ మోల్, లోగీమోల్?

ఉమడ్ పడా పావస్ పరిప్రోత్,
ఫూట్ రహే నవ నవ జలస్రోత్;
జీవన కీ యే లహరేఁ లోల్
లోగీ మోల్, లోగీ మోల్?

విరల జలద పట్ ఖోల్ అజాన్
ఛాయీ శరద రజత ముస్‌కాన్,
యహ్ ఛవి కీ జ్యోత్స్నా అనమోల్
లోగీ మోల్, లోగీమోల్?

అధిక అరుణ హై ఆజ్ సకాల్ —
చహక్ రహే జగజగ ఖగ బాల్;
చాహో తో సున్‌లో జీ ఖోల్
కుఛ్ భీ ఆజ్ న లూంగీమోల్.

# వెలబెట్టి కొనెదరా? * *

మంచు బిందుల శోభ మించు నవ్వేడి పూలు
తీసుకొని వచ్చాను ఎవరు కొంటారు?

మధు ఋతుజ్వాల ఈ మామిడి చిపురులై
పొలిచె కోకిల గొంతు పిలిచె కుహుకుహులతో
వెలబెట్టి కొనెదరా? వెలబెట్టి కొనెదరా?

సెలయేళ్లు క్రొత్త క్రొత్తలై సాగినవి, జీవ
సనులోన క్రొత్త తరగలు పొంగిపోయినవి
పిరళ జలదాకాశ వీథిలో శీతాంశు
తరల జ్యోత్స్నలు రజతామూల్యద్యుతులయ్యె
వెలబెట్టి కొనెదరా? వెలబెట్టి కొనెదరా?

ఉదయ కాంతులు మించె కదలె ఖగ సంతతులు
మదివిచ్చి చూడు, పూవులు వాసనల తోరు
ముదుల శోభ మించు నవ్వేడి పూలు
తీసుకో ఈ రోజు నేను వెల గైకొనను.

---

అనువాదము: శ్రీ దండమూడి మహీధర్

## ★ ★ జగకే ఉర్వర్ ఆంగన్ మేఁ

జగకే ఉర్వర్ ఆంగన్ మేఁ
బరసో జ్యోతిర్మయ జీవన్!
బరసో లఘు లఘు తృణ తరు పర్
హే చిర అవ్యయ చిర నూతన్!
బరసో కుసుమోఁ మేఁ మధుబన్,
ప్రాణోఁ మేఁ అమర ప్రణయ ధన్;
స్మితి స్వప్న అధర పలకోఁ మేఁ,
ఉర్ అంగోఁ మేఁ సుఖ యౌవన్!

ఛూ ఛూ జగకే మృత రజ కణ్
కర్ దో తృణతరుమేఁ చేతన్,
మృన్మరణ బాంధ్ దో జగకా,
దే ప్రాణోఁ కా ఆలింగన్!
బరసో సుఖ బన్, సుఖమా బన్,
బరసో జగజీవన కే ఘన్!
దిశి దిశి మేఁ ఔఁ పల్ పల్ మేఁ
బరసో సంసృతి కే సావన్!



# విశ్వవిశాలాంగణమున ★ ★

ఉర్వర జగతీ తలమున
జ్యోతిర్మయ జీవనమును
వర్షింపుము ! వర్షింపుము !
అల్పతరు తృణాగ్రమ్ముల అవ్యయ
చిరనూతన లావణ్యా శోభలను
నవ సుమనస్సుల ప్రాణవీధికల
మధువులు అమర ప్రణయ సంపదలు
అధరాంచలముల స్మిత స్వప్నములు

ఉరోజముల సంపూర్ణ యౌవనము.
వర్షింపుము ధూళి కణమ్ముల స్పృశించి
తృణముల ప్రాణమ్ము నించి
జడ మృత్యువులందు చిక్కు
జగమున ప్రాణాలింగన
సుఖ సుషమల వర్షింపుము
నవజీవన నీరదమా !
వర్షింపుము, వర్షింపుము.
దిశ దిశలను ! అహరహమును
సంస్కృతి శ్రావణ ఘనమా
వర్షింపుము, వర్షింపుము.

అనువాదము: శ్రీ దండమూడి మహీధర్



★ ★

## భారత్ మాతా

భారత మాతా
గ్రామ వాసినీ!

ఖేతోం మేం ఫైలా దృగశ్యామల్
సస్యభరా జన జీవస ఆంచల్,
గంగా యమునా మేం శుచి శ్రమజల్

శీలమూర్తి !
సుఖ దుఃఖ ఉదాసినీ!

స్వప్న మౌన, ప్రభు పద నత చితవన్,
ఓంఠోం పర్ హంసతే దుఃఖ కే క్షణ్,
సంయమ తపకా ధరతీ సా మన్,

స్వర్గ కళా,
భూ పథ ప్రవాసినీ!

తీస్కోటి సుత, అర్ధనగ్న తన్,
అన్న వస్త్ర పీడిత, అనపఢ్, జన్,
ఝూడ్ ఫూంస్ ఖర్ కే ఘర్ ఆంగన్,

ప్రణత శీశ్,
తరుతల నివాసినీ!

విశ్వ ప్రగతి సే నిపట్ అపరిచిత్,
అర్ధ సభ్య, జీవనరుచి సంస్కృత్,
రూఢి రీతియోంసే గతి కుంఠిత్,

రాహు గ్రసిత
శరదేందు హాసినీ!

## భారతమాత

✶ ✶

గ్రామవాసిని ! పొలముల గట్ల పచ్చ
దనము నిండిన బ్రతుకుల ధాన్యములను
పండి గాంగయామున జలాఖండవాహి
నీ శుచి శ్రమజలమూర్తి నీరదాంగి.

సౌఖ్య దుఃఖ సమస్ఫూర్తి. స్వప్నమౌన
భావ, ప్రఘు పద నత బుద్ధి, బాధితాత్మ
వేళ పెదవుల నవ్వు దేవివి, క్షుధార్త
రాత్రి, సర్వ కళాపతాంత ప్రవాసి.

సుతులు ముప్పదికోట్ల తక్కితులు, అర్ధ
నగ్నతనులు, అనక్షరాస్యులు, అన్న-
వస్త్ర పీడితుల్, ప్రణత భావాశ్రితులు, త
రుతల వాసినీ !

అపరిచిత విశ్వ విజ్ఞాన సుపరిణామ
అర్థ సభ్య, సంస్కృత జీవనాధ్వరుచిర
రూఢభావ కుంఠిత గతి రుచిర శార
దేందు హాస రాహుగ్రస్త, హీన శక్తి

బహు శతాబ్దముల నీ కర్మ భాజనమ్ము
లక్ష్యహీన జర్జరిత నర ప్రబంధ

నదియోం కా ఖండహార్, నిష్క్రియమన్,
లక్ష్యహీన, జర్జర జన జీవన్,
కైసే హో భూ రచనా నూతన్,

జ్ఞాన మూఢ
గీతా ప్రకాశినీ!

పంచశీల రత, విశ్వశాంతి వ్రత,
యుగ యుగ సే గృహ ఆంగన్ శ్రీహత్,
కబ్ హోంగే జన ఉద్యత జాగ్రత్?

సోచ్ మగ్న
జీవన వికాసినీ!

ఉసే చాహియే లోహ సంగఠన్
సుందర-తన్, శ్రద్ధాదీపిత మన్,
భూ జీవన ప్రతి అథక్ సమర్పణ్,

లోక కళామయి!
రస విలాసినీ!



మీ విమూఢము, నవసృష్టి యెట్లు రచన
సేయవలె గీతా ప్రకాశినీ !

పంచశీల రతమ్ము ప్రపంచ శాంతి
వ్రతము, యుగయుగముల నుండి చిలికినట్టి
శ్రీ, సముద్యోతమై యెట్లు చెలువు కాంచు
జీవన వికాసినీ !

అందుకొరకు సమస్త ప్రజాళి యైక్య
మయి సముద్దీప్తమనమున అచ్ఛుతనుల
దేశ జీవనమున కయి దీప్తత్యాగ
మవసరము సర్వలోక కళాత్మ భావ
నీ ! రస విలాసినీ !

అనువాదము: శ్రీ దండమూడి మహీధర్



★ ★

# తాజ్

హాయ్! మృత్యు కా ఐసా అమర, అపార్థివ పూజన్
జబ్ విషణ్ణ, నిర్జీవ పడా హో జగకా జీవన్!
స్ఫటిక్ సౌధ మేఁ హో శృంగార మరణ కా శోభన్,
నగ్న క్షుధాతుర, వాస విహీన రహే జీవిత జన్!
మానవ్! ఐసీ భీ విరక్తి క్యా జీవన కే ప్రతి?
ఆత్మా కా అపమాన్, ప్రేత ఔ, ఛాయా సే రతి!
ప్రేమ అర్చనా యహీ, కరేఁ హమ్ మరణ కో వరణ్?
స్థాపిత కర్ కంకాల్, భరేఁ జీవన కా ప్రాంగణ్?
శవ కో దేఁ హమ్ రూప, రంగ్, ఆదర మానవ కా,
మానవ కో హమ్ కుత్సిత్ చిత్ర బనా దేఁ శవ కా?!
యుగ యుగ కే మృత ఆదర్శోఁ కే తాజ్ మనోహర్
మానవ కే మోహాంధ హృదయ మేఁ కియే హుయే ఘర్,
భూల్ గయే హమ్ జీవన కా సందేశ అనశ్వర్
మృతకోఁ కే హైఁ మృతక్, జీవితోం కా హై ఈశ్వర్



# కిరీటం ★ ★

మృత్యువు కేలా యీ అలౌకిక పూజలు
జగమంతా శోకించే నిర్జీవం కాగా
అటు చూస్తే సుధా సౌధంలో
మరణశృంగార డోలల నూగు సుందరులు
ఇటు చూస్తే క్షుత్పీడిత
వాసహీన, నగ్నరూప జనసందోహం.
మానవుడా! జీవితమంటే యింత విరక్తి దేనికి?
ఆత్మధిక్కారం తగునా భూత ప్రేతాశ్లేషం
మృత్యాహ్వానం ప్రేమార్చన కాగలదా ?
శవసమ్మానం మానవాదరణ కాగలదా ?
మానవుణ్ణి శవరూపంగా చిత్రించడమా ?
యుగయుగాల నిర్జీవాదర్శాలంకార కిరీటాలు
మానవ మోహాంధ హృదయాలు నిండాయి
జీవితానశ్వర సందేశం విస్మరించాం
మృతులకు తోడు మృతుడే
చిరంజీవి నరునికి రక్ష ఈశ్వరుడే !

అనువాదము: శ్రీ దండమూడి మహీధర్

★ ★

# జీవన దాన్

మైఁ ముట్ఠీ భర్ భర్ బాంట్ సకూఁ
జీవన కే స్వర్ణిమ పావక కణ్
వహ్ జీవన జిస్ మేఁ జ్వాలా హో
మాంసల్ ఆకాంక్షా హో మాదన్ !

వహ్ జీవన జిస్ మేఁ శోభా హో, —
శోభా సజీవ, చంచల్, దీపిత్,
వహ్ జీవన్ జిసకో పూర్ణప్రతీతి
సుఖ దుఃఖ సే రహతీ హో ముఖరిత్!

జిస్ మేఁ అంతర్ కా హో ప్రకాశ్
జిస్ మేఁ సమవేత హృదయ స్పందన్
మైఁ ఉస్ జీవన కో వాణీ దూఁ
జో నవ ఆదర్శోం కా దర్పణ్ !

జీవన రహస్యమయ భర్ దేతా
జో స్వప్నోంసే తారాపథ మన్
జీవన రక్తోజ్వల కర్తా జో
నిత రుధిర శిఖావోం మేఁ గాయన్ !

ఇస్ మేఁ న తనిక్ సంశయ ముఝకో
యహ్ జన - భూ జీవన కా ప్రాంగణ్
జిస్ మేఁ ప్రకాశ కీ ఛాయాయేఁ
విచరణ్ కరతీఁ క్షణ — ధ్వనిత చరణ్ !

# జీవనదానము

పావకోజ్జ్వలతోజ్జీవ జీవనంపు
స్వర్ణకణములు ప్రాంజలాంజలుల నింపి
నేనె పంచగాజాలు ఈ నేల కెల్ల . .

ఆ ప్రదిమియందు దీప్తి గోరాముచుండు
అందు మాదకాకాంక్ష తారాడుచుండు
అంప నిలువెల్ల నవశోభ నింపుచుండు
అది సజీవమ్ము నవశోభ నప్పురమ్ము
బాల చపలమ్ము కాంక్షల కాలయమ్ము
కూర్మిలవి జీవన సుఖముఖోర్ములందు
తీయనౌ స్వప్నముల్ నింపి పెన్ను మంచు
క్రాలునంపున స్వాంతప్రకాశ మెపుడు
అందు జాగృతమై యుండు ననవరతము
సర్వహృదయానుకంపన స్పందనమ్ము

అట్టి ప్రసరణ కేనిస్తు నమృతవాణి
దర్పణమ్మది నవనవాదర్శములకు
జీవనమ్మది చిర రహస్శ్రీలు నిండి
స్వప్నలోకణాను లల్లు వలపు తలపు
తారికా పథమైన హృదంతరమున . .

అపుడు రక్తోజ్జ్వలమ్మైన యట్టి ప్రదిమి
రుధిర శిరలమై గానముల్ గుములబాడు
లేదు సందియ మింతయు లేదు నాకు
ప్రజల భువియిది జీవన ప్రాంగణమ్ము . .

మైఁ స్వర్గిక శిఖరోంకా వైభవ
  హూఁ లుటారహా జన ధరణీ పర్
జిస్‌మేఁ జగ జీవన కే ప్రరోహ
  నవ మానవతా మేఁ ఉఠేఁ నిఖర్ ।

దేవోంకో పహనా రహా పునః
  మైఁ స్వప్న మాంస కే మర్త్యవసన్,
మానవ ఆనన సే ఉఠా రహా
  అమరత్వ ఢఁకే జో అవగుంఠన్ ।

---

ఇందు గాంతి పాదమ్ములు చిందుహాయలు
ఝణ రణ త్కింకిణీయుత సరణు లగుచు
బలిమి స్వర్గోన్నతమ్మైన వైభవమ్ము
దెచ్చి ధారుణికిం బంచి యిచ్చువాడ
నందు నుండు జగజ్జీవనాంకురములు
నవ్య మానవ చైతన్య భవ్యగతులు . .

దివ్యుల ధరింప జేతును తిరిగి నేను
స్వప్న మాంసలములు మర్త్యవసనములను
అమరతం గప్పు నవగుంఠనముల బట్టి
చించివైతు మానవ ముఖశ్రీలు వెల్గ.

అనువాదము : శ్రీ రాచకొండ నరసింహమూర్తి





# ప్రాణాకాంక్ష

ఝన్ పాయల్ ఛమ్,
ఛమ్ ఛమ్!
ఉర్ కే కంపన్ మేఁ నిర్మమ
ఝన్ పాయల్ ఛమ్
ఛమ్ ఛమ్!

హృదయ రక్తరంజిత సుందర్
నృత్య ముగ్ధ ప్రియ చరణోం పర్,
ప్రాణోం కే స్వప్నాకాంక్షి సమ్
ప్రణయ జనిత, వంచిత నిరుపమ,
ఝన్ పాయల్ ఛమ్,
ఛమ్ ఛమ్!

ఉద్వేలిత హో జబ్ అంతర్
స్మృతి లహరియోం పర్ సగ్వర్,
జీవన కే గతిలయ మే అక్షమ
పద ఉన్మద, మత్ ఛమ్, మత్ ఛమ్.
ఝన్ పాయల్ ఛమ్,
ఛమ్ ఛమ్!



# ప్రాణాకాంక్ష



మొరయు మొరయు మింక బళీ
మువ్వల మువ్వల రవళీ...

నిర్మల హృద్రాగారుణ
నృత్యత్ప్రియ చరణమ్ముల
ప్రాణ కనత్కాంక్ష హోత్రి
ప్రణయ ముగ్ధ చంచలపై...

ఏల మఱి కలఁగిన యెడంద
వెత తరగల పదము లూని
జీవన గతి లయ కలయక
ఈ వాగకు మూగకుమీ....

ఈ యెడంద యలజడులకు
ఇంతయు జంకకు కలగకు
కెరలి కెరలి మొరయు మొరయు
తెరలి తెరలి మొరయు మొరయు....

అనువాదము: శ్రీ రాచకొండ నరసింహామూర్తి



★ ★

# రాష్ట్రీ గాన్

జన భారత హే!
భారత హే!
స్వర్గ స్తంభవత్ గౌరవ మస్తక్-
ఉన్నత హిమవత్ హే!
జన భారత హే!
జాగ్రత్ భారత హే!

గగనచుంబి విజయీ తిరంగ ధ్వజ్
ఇంద్రచాపమత్ హే,
కోటి కోటి హమ్ శ్రమజీవీ సుత
సంభ్రమ యుత నత హే
సర్వ ఏక మత, ఎక ధ్యేయ రత,
సర్వ శ్రేయ వ్రత హే!
జన భారత హే,
జాగ్రత్ భారత హే!

సముచ్చరిత శతశత కంఠోంసే
జన యుగ స్వాగత హే,
సింధు తరంగిత, మలయ శ్వసిత్,
గంగాజల ఊర్మి నిరత హే,
శరద ఇందుస్మిత అభినందన హిత
ప్రతిధ్వని పర్వత హే!
స్వాగత హే, స్వాగత హే,
జన భారత హే,
జాగ్రత్ భారత హే!

# భారతమా



జనతా భారతమా!
జాగృత భారతమా!

స్వర్గ స్తంభవ దున్నత మస్తక
గౌరవ హిమ నగమా
జనతా భారతమా జాగృత భారతమా!

ధ్వజవర్ణత్రయ చిత్రిత నభమా - ఇంద్రచాప గరిమా
కోటి కోటి కార్మిక నతమస్తక హస్తాంజలి యుతమా
ఏకారాధ్యమ ఏక ధ్యేయమ సర్వశ్రేయోవ్రతమా
జనతా భారతమా! జాగృత భాగతమా!

ఉన్నత శతశత కంఠావాహిత జన యుగ సుస్వాగతమా
సింధు తరంగిత మలయోచ్ఛ్వాసిత గంగోర్మి మృదురుతమా
శరదిందుస్మిత్యభివందన వత్ప్రతి సుస్మిత పర్వతమా
స్వాగతమా స్వాగతమా జనతాభారతమా జాగృతభారతమా!

స్వర్గ ఖండ షడృతు ప్రదక్షిణ ఆమ్రమమంజరీ మధుపోద్రుతమా
ఫలవ ద్రుమమా, కూజత్పికమా, అభిమత కామోర్వరమా

స్వర్గ ఖండ షడ్ఋతు పరిక్రమిత్,
ఆమ్ర మంజరిత, మధుప గుంజరిత,
కుసుమిత ఫలద్రుమ పిక కలకూజిత,
ఉర్వర, అభిమత హే!
దశ దిశ హరిత సస్యశ్రీ హర్షిత
పులక రాశివత్ హే!
జన భారత హే!
జాగ్రత్ భారత హే!

కిరణ కేళీ రత రక్త విజయధ్వజ
యుగ ప్రభాతమత్ హే!
కీర్తి స్తంభవత్ ఉన్నత మస్తక్
ప్రహరీ హిమవత్ హే!
పదతల చూళత ఫేనిలోర్మి ఘన్
శేషోదధి నత హే
వర్గ ముక్త హమ్ శ్రమిక కృషక జన
చిర శరణాగత హే!
జన భారత హే,
జాగ్రత్ భారత హే!



దిశదిక్శ్యామల సశ్యశ్రీస్మిత పులకిత సంభర దురమా
జనతాభారతమా జాగృతభారతమా . .

కిరణక్రీడారత విజయధ్వజ వక్త్రప్రభాత యుగమా
కీర్తిస్తంభవ దున్నత మస్తక రక్షక హిమ నగమ్మా
పదతల స్పృశచ్ఛత ఫేనోర్మి ఫణనత శేష భుజగమ్మా
చిరశరణాగత కార్మిక కర్షక వర్గముక్తి దాభయమా

జనతా భారతమా
జాగృత భారతమా . .

అనువాదము: శ్రీ రాచకొండ నరసింహామూర్తి

★ ★

## గీత్ విహంగ

మై నవ మానవతా కా సందేశ్ సునాతా,
స్వాధీన లోక కీ గౌరవ గాథా గాతా,
మైం మనఃక్షితిజ్ కే పార్ మౌన శాశ్వత కీ
ప్రజ్వలిత భూమి కా జ్యోతివాహ్ బన్ ఆతా !

యుగ కే ఖండ్‌హర్ పర్ డాల్ సునహలీ ఛాయా
మైం నవ ప్రభాత కే నభ మేం ఉర్ ముసకాతా,
జీవన పతఝర్ మేం జనమన కీ డాలోంపర్
మైం నవ మధు కే జ్వాలాపల్లవ సులగాతా !

ఆవేశోంసే ఉద్వేలిత జన సాగర మేం
నవ స్వప్నోం కే శిఖరోంకా జ్వార్ ఉఠాతా,
జబ్ శిశిర క్రాంత, వన-రోదన్ కరతా భూమన్,
యుగ పిక వనప్రాణోంకా పావక బరసాతా :

మిట్టీ కే పైరోం సే భవ-క్లాంత జనోంకో
స్వప్నోం కే చరణోంపర్ చలనా సిఖలాతా,
తాపోంకీ ఛాయా సే కలుషిత అంతర్ కో
ఉన్ముక్త ప్రకృతి కా శోభా వక్ష దిఖాతా !

జీవన మన కే భేదోంమేం సోయీ మతి కో
మైం ఆత్మ ఏకతా మేం అనిమేష జగాతా,
తమ పంగు, బహిర్ముఖ జగ మేం బిఖరే మనకో
మైం అంతర్ సోపానోంపర్ [illegible]

# గీత విహంగమము ★ ★

నవ్య మానవతా దీప్తి ధన్యమైన
దివ్య సందేశ మాధురుల్ దెచ్చి గ్రోల్చి
పొంగి నిరత స్వతంత్రతాపూర్ణ దేశ
పరమ గౌరవ గాథలన్ పాడి వినుతు ..

నేను క్షితిజమున కవల నిల్చి కాంతి దేశములనుండి వెల్గుల దెచ్చి యిత్తు
పాడుపడిన యుగపు గోంపపైన బంగరువుల నీడలు పట్టి చిరునవు రువ్వి
ఎగసిపోదు నవోదయ గగనములకు ..

నేను బ్రతుకది శిశిరమ్ము వైనచోట జనుల మనసుల రెమ్మల జ్వాల తెగడు
తేనియలు నిండు చిరువుల దెచ్చి గూర్తు ..

వ్యగ్ర మానవసాగర ముగ్రమగుచు నేల దాట క్రొత్తకలలు వెల్గు దెత్తు
శిశిర పీడితమైమై భూమి చేతన మ్మరణ్య రోదనమ్ము సలుప ప్రాణ పావ
కములు కురిసిపోదు యుగపికస్వనగుచు ..

మట్టి గొట్టిన కాళులం బ్రదిమి బరువు
నట్టుపె ట్టగమూల్గు మానవుల స్వప్న
చరణముల నడిపింతు వేసట జీలు దీర
తాసముల క్లాంతి బడలు హృదయము లలర
ప్రకృతి సుందర వక్షమ్ము పరచియిత్తు
బ్రతుకు టడజళ్ళకు జోగి నిదురకూరి
తెలివి దప్పిన బుద్ధిని జేవెలుగు దేర్ప
ఆత్మయోగము నందాని కార్తిబాపి
మేలుకొల్పుదు నే నిర్నిమేష గతిగ ...

ఆదర్శోం కే మరుజల సే దగ్ధ మృగోంకో
మైఁ స్వర్గకా స్మిత అంతర్పథ బతలాతా.
జన జన కో నవ మానవతా మేఁ జాగ్రత్ కర్
మైఁ ముక్తకంఠ జీవన్ రణ శంఖ బజాతా !

మైఁ గీత్ విహగ, నిజ మర్త్యనీడ్ సే ఉడ్‌కర్
చేతనాగగనమేఁ మన కే పర్ ఫైలాతా,
మైఁ అపనే అంతర కా ప్రకాశ బరసాకర్
జీవన కే తమ కో స్వర్ణిమ కర్ నహలాతా !

మైఁ స్వర్దూతోంకో బాంధ్ మనో భావోం మేఁ
జన జీవన కా నిత ఉనకో అంగ బనాతా,
మైఁ మానవప్రేమీ, నవ భూస్వర్గ బసాకర్
జన ధరణీపర్ దేవోంకా విభవ లుటాతా !

మైఁ జన్మ మరణ కే ద్వారోం సే బాహర్ కర్
మానవకో ఉస్కా అమరాసన్ దే జాతా,
మై దివ్య చేతనా కా సందేశ సునాతా,
స్వాధీన్ భూమికా నవ్య జాగరణ గాతా !



ఇరులు జుట్టి మనస్సు బహిర్ముఖమయి బన్నపడి కుంటువడిన విపన్న వేళ
లోనికిం జూపు నిచ్చెడి లోని వెల్గు - మెట్ల పైపైకి జేర్తు చీకట్లు చెదర..

భ్రమసి యాదర్శమృగతృష్ణ పాలబడ్డ జంతు సంతతి నోదార్చి స్వర్గ గంగ
శీతలాచ్ఛస్మితద్యుతుల్ చిమ్మునట్టి చోటికే పోవతోత్రోవజూపుచుందు
మానవుని మానవుని నవమానవత్వ సుప్రభాతంపు దర్శన శుభము వేళ
సత్తి జీవన రణశంఖ మొత్తి నేనె మేలుకొల్పుదు లోకాలు మేలుకోగ.

ఏను గీతవిహంగమ నిచటి మర్త్య-నీడము వదలి చైతన్య నిర్మల గగ
నాంతరములు మనసు లెక్కలార్చిపోదు ..

నేను నాలోని వెల్గులు నేల కురిసి బ్రిదుకు చీకట్ల ముంచెత్తి స్వర్ణ సేచ
నమ్ము సేతు బ్రదుకు బంగరమ్ముగాగ ..

స్వర్గ దూతల నామనో భావబంధ నమ్ములం గట్టితెచ్చి మానవుని బ్రదుకు
చెలిమికానిగా నెప్పుడు సేయుచుందు ..

సర్వ మానవజాతి నేస్తమ్ము నేను
భూమికే నేను స్వర్గపుం బొందు తెత్తు
దివ్యుల విభవమంతయు దెచ్చి ధరణి
జనునకుం బంచి పంచి యిత్తును సుఖముగ
జన్మ మరణాల ద్వారముల్ సాగనంపి
జనునకే యిత్తు స్వా-మరాసనము తిరిగి
నేను దివ్యచైతన్య సందేశమిత్తు
పొంగి నిరత స్వతంత్రతా పూర్ణభూమి
భవ్యనవ్య జాగృతి గీతి పాడుచుందు

అనువాదము : శ్రీ రాచకొండ నరసింహమూర్తి



# రక్త కమల్ శ్వేత కమల్

రక్త కమల్, శ్వేత కమల్,
ఖిలే జ్యోతి పలక నవల్ !

రక్త కమల్ జీవన స్మిత,
శ్వేత కమల్ శాంతి జనిత
ఖోల్ రహే రశ్మి స్ఫురిత్
మానస మేం జ్వాలాదళ్ !

నీల కమల్ శ్రద్ధానత,
స్వర్ణ కమల్ భక్తి ప్రణత,
కర్దమ మేం ఖిలే సతత్,
ప్రీతి మధుర అంతస్తల్ !

అమిత సురభి రహీ నిఖర్,
గూంజ్ ఉఠే లోక నికర్,
జాగ్ ఉఠా జీవన సర్
స్వర్ణిమ లహరేం ఉచ్ఛల్ !

నయీ చేతనా హిలోర్,
శోభా ఛాయీ అఛోర్,
హాఁసే కో నయా భోర్,
గావో సుర, జన మంగళ్ !



# రక్తకమలము — శ్వేతకమలము ★ ★

సురలారా స్వర లహరుల్
తెగలం గెరలం బాడుడి
మానవ మంగళ గీతులు
శ్రీనవారుణ జ్యోతులు ..

నవ చైతన్య తరంగము
భవ నవ శోభా రంగము
అల్లదె నవ సుప్రభాత
మరుణోదయ పూర్వనగము ..

అదె జీవన సరోవరము
అల్లవె కాంచన లహరుల్
క్రమ్మె నివే నెఱతావుల్
గమ్మనె ముల్లోకమ్ములు ..

అవిగవిగో కమల వనులు
అందచందములకు గనులు
జ్యోతిర్గళ పద్మలములు
చూపు నెపుడు క్రొందోవలు ..

శ్వేత పీత రక్త నీల - వివిధ వర్ణ కమలమ్ములు - సదా
పంకజాతమ్ములు - మృదుమధురాంత స్థలములు ..

శ్వేత కమలమదే శాంతి — పీత కమలమిదే భక్తి
కెందమి జీవన సుస్మితి నీల్దమి శ్రద్ధా సంభృతి ..

అదె జీవన సరోవరము - అల్లదె కాంచన లహరుల్
ప్రాణాగ్ని జ్యోతిర్దళ - మానస మంగళ గీతులు ..

అనువాదము : శ్రీ రాచకొండ నరసింహమూర్తి



# మర్మ కథా

బాంధ్ దియే క్యోం ప్రాణ్
ప్రాణోంనే !
తుమ్‌నే చిర్ అనజాన్
ప్రాణోంనే !

గోపన్ రహ్ న సకేగీ
అబ్ యహ్ మర్మ కథా,
ప్రాణోం కీ న రుకేగీ
బఢతీ విరహ వ్యథా;
వివశ ఫూట్ తే గాన్,
ప్రాణోంనే !

యహ్ విదేహ ప్రాణోం కా బంధన్
అంతర జ్వాలా మేం తపతా తన్ :
ముగ్ధ హృదయ సౌందర్య జ్యోతి కో
దగ్ధ కామనా కర్ తా అర్పణ్ !
నహీం చాహతా జో కుఛ్ భీ ఆదాన్
ప్రాణోంనే !
బాంధ్ దియే క్యోం ప్రాణ్
ప్రాణోంనే!

# రహోగాథ

★ ★

ఈ పసిప్రాణమ్ముల గుడి
ఏదో వైచిత్ర పెన్మిడి
ఈవేనా నా ప్రాణము
ఈవేనా నా ప్రాణము . .

దాగనేర దింకపైన
దాహదగ్ధమైన లోన
ప్రాణమ్ముల రహోగాథ
గానమ్ముల నుబుకు బాధ .

ఈ పసిప్రాణమ్ముల గుడి
ఏదో తెలియని పెన్మికి
లోమంటల వేగిఖ్బు మేను
నేమో తెలియంగరాను .

ముద్దరాలు నా యెదంద
మోవి కదపి కోరబోదు
సౌంద్య జ్యోతి పుయిందు
సర్వార్పణ మనెడి జోదు . .

ఈ పసిప్రాణమ్ముల గుడి ఏదోవై చిత్రి పెన్మిడి
ఈవేనా నా ప్రాణము - ఈవేనా నా ప్రాణము.

అనువాదము : శ్రీ రాచకొండ నరసింహామూర్తి

# శరద్ చాందనీ

శరద్ చాందనీ,
విహాఁస్ ఉఠీ అతల్ మౌన్
పీలిమా ఉదాసినీ!

ఆకుల్ సౌరభ సమీర్,
చల్ ఛల్ చల్ సరిత్ నీర్,
హృదయ ప్రణయ సే అధీర్,
జీవన ఉన్మాదినీ!

అశ్రుసజల తారక దల్,
అపలక దృగ గిన్‌తే పల్:
ఛేడ్ రహీ ప్రాణ వికల్
విరహ వేణు వాదినీ!

జగీఁ కుసుమ కలి థర్ థర్,
జగే రోమ్ సిహర్ సిహర్,
శశి అసి సీ ప్రేయసి స్మృతి
జగీ హృదయ హ్లాదినీ!
శరద్ చాందనీ!

# శరచ్చంద్రికలు



శరద చంద్రికలు విరిసి నవ్వగా
విన్నబోయె విన్నెలు నీలిమలు ..

వ్యాకులపడె సౌరభ సమీరములు
కాకలి వినిచెను సరిన్నీరములు
ప్రణయ మధురిమాధీర హృదయములు
రాగిలె జీవన మధూన్మాదములు
శరచ్చంద్రికలు విరిసి నవ్వగా ..

నాశుప్రసయన తారకా నికరములు
సడిసవ్వడి విడ నిర్నిమేషములు
వికలవేదనా విల ప్రాణముల
విరహ వేణు వీణా వాదకములు
శరచ్చంద్రికలు విరిసి నవ్వగా ..

రెప్ప విద్రిచి కన్నెత్తె మొగ్గగమి
రే ముద్దియ పులకించె హెచ్చి తమి
శశి యసి వలె ప్రేయసీ మధుస్మృతి
సాగి రేగె హృదయాహ్లాదకములు
శరచ్చంద్రికలు విరిసి నవ్వగా ..
విన్నబోయె విన్నెలు నీలిమలు .

అనువాదము : శ్రీ రాచకొండ నరసింహామూర్తి

* *

# మర్మ వ్యథా

ప్రాణోంమేఁ చిర వ్యథా బాంధ్ దీ।
క్యోఁ చిరదగ్ధ హృదయ కో తుమ్ నే
వృథా ప్రణయ కీ అమర సాధ్ దీ।

పర్వత కో జల్, దారూ కో అనల్,
వారిద కో దీ విద్యుత్ చంచల్,
ఫూల్ కో సురభీ, సురభి కో వికల్
ఉడ్నే కీ యిచ్ఛా అబాధ్ దీ।

హృదయ దహన్ రే హృదయ దహన్,
ప్రాణోం కీ వ్యాకుల వ్యథా గహన్,
యహ్ సులగే, హోగీ న సహన్,
చిర స్మృతి కీ శ్వాస సమీర్ సాథ్ దీ।

ప్రాణ గలేఁగే, దేహ జలేగీ,
మర్మ వ్యథా కీ కథా ఢలేగీ,
సోనే సీ తప నిఖలేగీ
ప్రేయసి ప్రతిమా, మమతా అగాధ్ దీ।
ప్రాణోం మేఁ చిర వ్యథా బాంధ్ దీ।

---

# మర్మ బాధ

★ ★

ప్రాణమ్ములకు చిరబాధ నిచ్చితివి
నా చిర దగ్ధహృదిని ఈ తీరని
వలపు కోరికల ఆశ బుచ్చితివి.

గిరికి జలము దారువులో అనలము
వారిదములలో శంపాశకలము
సుమములసురభి సురభిలో నిరతము
ప్రసరించెడి అభిలాష నిచ్చితివి.

హృదయ దహనమిది హృదయ దహనమిది
వికలప్రాణముల వ్యథావహనమిది
తీరక రగులును పొగలై సెగలై
అతిశ్వసనమును తోడు జేసితివి.

ప్రాణము కరుగును దేహము రగులును
మర్మవేదనాగాథలు పొగులును
తప్తస్వర్ణమై ప్రియావిగ్రహము
వెలుగదు నాకీ ప్రీతి నిచ్చితివి
ప్రాణమ్ముల చిర బాధ నిచ్చితివి.

అనువాదము : శ్రీ బైరాగి.

# లక్ష్మణ్

విశ్వశ్యామ జీవన కే జలధర్
రామ ప్రణమ్య, రామ హైం ఈశ్వర్।
లక్ష్మణ్ నిర్మలస్నేహ సరోవర్
కరుణా సాగర సే భీ సుందర్!
సీతా కే చేతనా జాగరణ్
రామ్ హిమాలయ సే చిర పావన్
మేరే మన్ కే మానవ లక్ష్మణ్
ఈశ్వరత్వ భీ జిన్హేం సమర్పణ్।

ధీరవీర అపనే పర్ నిర్భర్
ఝుకా అహం ధను, ఘర్ సేవా శర్,
కబ్ సే భూ పర్ విచర్ రహే వే
లక్ష్మణ, సచ్చే భ్రాతా, సహచర్।
యుగ యుగ సే చిర అవి ప్రతచారీ,
జగ జీవన విఘ్నోం కే హారీ,
జనసేవా ఉనకే ప్రియ నారీ
వహ్ ఊర్మిలా, హృదయ కో ప్యారీ।

రుధిరవేగనే కంపిత థర్ థర్
పకడ్ ఊర్మిలా కా పల్లవ కర్
బోలే, "ప్రియే, బిదా దో హంసకర్,
సంగ్ రామ్ కే జాతా అనుచర్!
చాదహ్ బరస్ రహే వహ్ బాహర్
బిఛుడే నహీం ప్రియా సే క్షణ భర్
సజగ ఊర్మిలా థీ ఉర భీతర్
మానవ కీ సీ ఊర్మి నిరంతర్।

# లక్ష్మణుడు ★ ★

విశ్వశ్యామ జీవితపు జలదుడు రాముడు వంద్యుడు రాము డీశ్వరుడు

నిర్మల స్నేహసరస్సు లక్ష్మణుడు కరుణానీరధి కన్న సుందరుడు

సీతానవచైతన్యజాగృతుడు రాముడు హిమగిరివోలె పావనుడు

ఈశ్వరత్వమునుగూడ అర్పణము చేయదగిన మానవుడు లక్ష్మణుడు

ధీరుడు వీరుడు స్వయం నిర్భరుడు నిరతాధిజ్యాహంధన్యాశ్రిత

సేవా ప్రఖరశరుడు నిజానుజుడు చరియించును భువిపై బాపుచు వెత

శాశ్వత అసిధారావ్రత ధరుడును విశ్వజీవనపు విఘ్నాపహారుడు

లోక సేవ అతని చిరసహచరి ఊర్మిళ లక్ష్మణునకు ప్రియమ్ముకదు

రుధిర వేగమున గజగజ వణకెడి నిజసతి కరపల్లవము చేతగొని

పలికె లక్ష్మణుడు 'ప్రియా సెలవు నే రాముని వెంట వనమున కేగెదను.'

పదునాల్గేండ్ల కఠిన వనవాసము కాని సతిని ఎడబాయలేదు మరి

హృదయాలయమున స్వర్ణప్రతిమవలె నిరతము నిలచెను ఊర్మిళ అత్తరి

స్నేహ ఊర్మిలా కా చిర నిశ్చల్
నహీం జాన్‌తా విరహ మిలన్ పల్,
వహ్ బహ్ బహ్ అంతర్ మేం అవిరళ్
బన్‌తా రహతా సేవా మంగళ్ !
వహ్ సేవా కర్తవ్య నహీం హై,
వహ్ భీతర్ సే స్వతః బహీ హై,
హార్దికతా కీ సరితా రహీ హై,
జిస్‌సే నిశ్చిత హరిత మహీ హై।

సహజ సలజ్జ సుశీల స్నేహమయ్,
జన జన కే సాథీ, చిర సహృదయ్,
ముక్త హృదయ, వినయీ, అతి నిర్భయ్
జన్మ జన్మ కా హో జ్యోం పరిచయ్ —
ఆతే వే సమ్ముఖ ప్రసన్న మన్
ఖూపర్ శత ఆనంద కే గగన్, -
బరస్ గయా జిస్‌కా మమత్వ ఘన్.
గౌర్ చాందనీ సా చేతన్ తన్।

ఐసే థూ కే మానవ లక్ష్మణ్
కభీ గా సకూం ఉన్‌కా జీవన్,
భూ జిన్‌కే సేవారత పదతల్
బచ్ జాతే పథ శూల్ ఫూల్ బన్।
రామ్ పతిత పావన్, దుఃఖ మోచన్,
లక్ష్మణ్ భవ సుఖ దుఃఖ మేం శోభన్!
వే సర్వజ్ఞ, సర్వగత, గోపన్,—
జ్ఞాన ముక్త యే పద నత లోచన్।

అతి నిశ్చలమూ ఊర్మిళ స్నేహము ఎరుగదు విరహోదులన వ్యత్యాసము
స్రవియించును అవిరళమంతరమున విరియును సేవామంగళహాసము
కాదది ఒక కర్తవ్యము మాత్రము తానై హృదయమునించి పొరలునది
భూమిని పచ్చపచ్చగను చేసెడి హార్దిక ప్రీతిపవిత్ర స్రోతమది

సహజస్నేహము శుభసౌశీల్యము జనులకు తోడునీడయగుసుహృదుడు
వినయము నిష్కపటత ముక్తత్వము జన్మజన్మముల దీర్ఘ పరిచయుడు
అతడరుదెంచు ప్రసన్నహృదయుడై భువిపై వినతానంద గగనమై
మమతాజలదము వర్షించును తనువు గౌర కౌముదీ కిరణమై

ఇలపై తిరిగెడి నరుడు లక్ష్మణుడు కీర్తించెద అతని జీవనమును
అతని సేవారత చరణమ్ముల తాకి ముండ్లు పూవులై పరచుకొను
రాముడు లోకానందుడు పావనుడు కష్టసుఖాలను ఎరుగు లక్ష్మణుడు
సర్వగతుడు సర్వజ్ఞుడగ్రజుడు స్పష్టవాటి నిర్లౌక్యుడు అనుజుడు

అనువాదము : శ్రీ బైరాగి





# హిమాద్రి ఔర్ సముద్ర

వహ్ శిఖర శిఖర పర్ స్వర్గోన్నత స్తర పర్ స్తర్ జ్యోం అంతర్వికాస్
చఢ్ సూక్ష్మ సూక్ష్మతమ చిద్ నభమే కర్ తా హో శుచి శాశ్వత విలాస్!

వహ్ మౌన, గంభీర, ప్రశాంత, ఊర్ధ్వ స్థిత భీ, అసంగ్, చిర నిరభిలాష్
ఆత్మా కీ గరిమా కా భూపర్ బరసాతా హో అకలుష ప్రకాశ్!

వహ్ నిర్వికల్ప చేతనా శృంగ్ ఉత్ స్వర్గ క్షితిజ సే భీ ఊపర్
అంతర్గౌరవ మేఁ సమాధిస్థ అపనీ హీ సత్తా పర్ నిర్భర్!

వహ్ జ్యోం అసీమ సౌందర్య అమర్, జో తృణ తృణ పర్ రహా నిఖర్
వహ్ రోమాంచిత ఆనంద్, నృత్య కర్తా విముగ్ధ భవ జిస్ లయ పర్!

యహ్ జ్యోం అనంత జీవన వారిధి, అహరహ అశాంత్ ఔ' ఉద్వేలిత్,
జిస్‌కే విస్తృత్ గహరే రంగ్ మేఁ అగణిత భవ కే యుగ అంతర్హిత్!

జగ కీ అబాధ్ ఆకాంక్షా సే ఇస్‌కా అంతస్తల్ ఆందోళిత్,
సుఖ దుఃఖ ఆశా ఆశంకా కే ఉత్థాన పతన్ సే చిర మంథిత్!

యహ్ మనశ్చేతనా జ్యోం సక్రియ్ భూ కే చరణోం పర్ బిఖర్ బిఖర్
శత స్నేహోచ్ఛ్వసిత తరంగోం కీ బాహోం మే లేతీ భూకో భర్!

నభ సే బన్ పవన్, పవన్ సే జల్, లాలాయిత్ యహ్ చేతనా అమర్
సోయీ ధర్తీ సే లిపట్, జగానే ఉసే, యుగోం కీ జడతా హర్

వహ్ మహాకాల్ సా రే అలంఘ్య జో శాశ్వత స్వర్గ మర్త్య ప్రహరీ,
యహ్ మహాదిశా సా హీ అకూల్ జిస్‌మేఁ విరాట్ సంస్కృతి లహరీ!

హిమగిరి కీ గహరాయీ ఊంచీ సాగర కీ ఊంచాయీ గహరీ
ఛాయా ప్రకాశ కీ సంస్కృతి కే జీవన రహస్య మేఁ హై ఛహరీ!

# సముద్రము–హిమాద్రి ★ ★

అది శిఖర శిఖరమున స్వర్గోన్నత మడుగడుగున అంతర్వికసితమై
అతి సూక్ష్మ సూక్ష్మతను చిన్నభమును స్పృశియించును శశ్వద్విలసితమై
మౌన గభీర ప్రశాంతమూర్ధ్వమది నిస్సంగస్థితి విగత వికారము
ఆత్మగరిమ అను శుభ్ర ప్రకాశము భువిపై వెలయగ జేయు ప్రకారము

నిర్వికల్ప చేతనాశృంగమది స్వర్గముకన్న మిన్నగా ఎగయును
అంత రౌరవసమాధిస్థమై స్వీయశక్తి సంభృతమై వెలయును
తృణతృణములలో వెలసెడి మురిసెడి నిస్సీమామృత సౌందర్యమ్మది
ముగ్ధజగతి లయమై నర్తించెడి రోమాంచిత దివ్యానందమ్మది

ఇది అనంత జీవితపు నీరనిధి నిరతాశాంతము సముద్వేలితము
దీని అగాధ గభీరగర్భమున లోకశతము యుగతతి సన్నిహితము
విశృంఖల నిసుబ్ధవాసనల ఆందోళితము దీని హృదయతలము
సుఖదుఃఖమ్ముల ఆశాశంకల పతనోత్థానమథితమీ అతలము

ఇది సంచలన్మహచ్చైతన్యము వసుధాపదముల యొలరయొలికిపడి
శతశతస్నేహోచ్ఛ్వసితవీచికల కౌగలించుకొను జగతిని వడివడి
శూన్యమునుండి శ్వసనమై శ్వసనమునుండి వారియై ఈ చైతన్యము
నిద్రితధరను స్పృశించి మేలుకొలుపును హరాచి చిరజడతాదైన్యము

శోభితస్వర్గమర్త్యముల కాపరి కాలమువలెనే దుర్లంఘ్యము అది
సృష్టిసకలమును వెలయగజేసిన దేశమువలెనే చిరాపారమిది
హిమగిరి గాంభీర్యము సమున్నతము సంద్రపుఔన్నత్యము గాభీరము
వెలుగుల నీడల ఈ సంసృతిలో జీవిత మర్మము పారావారము

అనువాదము : శ్రీ బైరాగి

★ ★

## వహ్ బుడ్ఢా

ఖడా ద్వార పర్, లాఠీ టేకే, వహ్ జీవన కా బూఢా పంజర్,
చిమటీ ఉసకీ సికుడీ చమడీ హిలతే హడ్డీ కే ఢాంచే పర్।

ఉభరీ ఢీలీ నసేం జాల్ సీ సూఖీ ఠఠరీ సే హై లిపటీం
పతఝడ్ మేం జూంతే తరు సే జ్యోం సూనీ అమరబేల్ హో చిపటీ।

ఉసకా లంబా డీల్ డౌల్ హై హడ్డీ కాఠీ చౌడీ
ఇస్ ఖండహర్ మేం బిజలీ సీ ఉన్మత్త జవానీ హోగీ దౌడీ।

బైఠీ ఛాతీ కీ హడ్డీ అబ్ ఝుకీ రీఢ్ కమటా సీ టేఢీ
పిచకా పేట్, గఢే కంధోం పర్, ఫటీ బివాయీ సే హై ఏడీ,

బైఠ్, టేక్ ధరతీ పర్ మాథా, వహ్ సలామ్ కర్తా హై ఝుక్ కర్
ఉస్ ధరతీ సే పాంవ్ ఉఠా లేనే కో జీ కర్తా హై క్షణ భర్।

ఘుటనోం సే ముడ్ ఉసకీ లంబీ టాంగేం జాంఘేం సటీం పరస్పర్,
ఝుకా బీచ్ మేం శీశ. ఝుర్రియోం కా ఝూంఝుర్ ముఖ నికలా బాహర్

హాథ్ జోడ్ చౌడే పంజోం కీ గుంథీ ఉంగలియోం కో కర్ సమ్ముఖ్
మౌన త్రస్త చితవన్ సే, కాతర వాణీ సే వహ్ కహతా నిజ దుఃఖ్।

గర్మీ కే దిన్, ధరే ఉపర్నే సిర్ పర్, లుంగీ సే ఢాంపే తన్,—
నంగీ దేహ్ భరే బాలోం సే,— వన్ మానుష సా లగ్తా వహ్ జన్।

భూఖా హై; పైసే పా, కుఛ్ గునగునా ఖడా హో, జాతా వహ్ ఘర్,
పిఛలే పైరోం కే బల్ ఉఠ్, జైసే కోయీ చల్ రహా జానవర్

కాలీ నారకీయ ఛాయా నిజ ఛోడ్ గయా వహ్ మేరే భీతర్,
పైశాచిక సా కుఛ్: దుఃఖోం సే మనుజ్ గయా శాయద్ ఉస్ మేం మర్।

———

# ఆ ముదుసలి ★ ★

నిలచె ద్వారమున కర్రనూతగొని అదే జీవితపు వృద్ధపంజరము
వణకెడి ఎముకల ప్రోవును కప్పిన ముడుతలు జారిన చర్మసంస్తరము
వదులుగ పొంగిన నరములు వల్లె గదియును శుష్కపంజరపు అస్థుల
హేమంతంలో మొండిమ్రానులను కౌగిలించు ఎండిన తీవెలవలె

దేహాయష్టి ఆతనిది సుదీర్ఘము అతి బలిష్ఠము అస్థిపంజరము
ఈ శిథిలములో శంపాలతవలె పరుగిడియుండును మత్తయౌవనము
నేడో రొమ్మున ఎండిన ఎముకలు ఒద్దవోలె వంగినది వెన్నెముక
లోతున పొట్ట బుజాలను గుంటలు పగిలిన నెగిలిన మడిమల చీలిక

కూర్చుని మెసలు నేలనానించుచు వంగివంగి యొసరించు సలాములు
తోడనె ఆ నేలను కాలూనక వెడలిపోవ దలను క్షణమాత్రము
ఆతని నిడివి కాళులును తొడలును మోకాళులపై నుండు అంటుకొని
వాలినతల, కడుముడతల ప్రోవౌ మొగము నల్గడలగాంచు త్రాసమున

కేలుమోడ్చి తన విస్తృతహస్తపు వ్రేళులు కోడించుచు ఎదురుగ నిడి
భీతదృష్టితో కాతరవాక్కులు విన్నవించు తన పాటులు ఆతడు
మండెవేసంగి తలపై తువాలు చిరుగు పంచచే కప్పిన దేహము
నగ్నాంగములు రోమమయములు కన ఆదిమమనిషియని
యగు సందేహము

క్షుధితుడు డబ్బులు దొరికినంతనే ఏదో గొణుగుచు తన ఇంటికి చను
నాలుగుకాళ్ల జంతువేదో తా రెండుకాళ్లపై నిలచి నడిచెనన
నల్లని తన నరకపు పెను నీడలు వదలి పోయె నాతడు నాలోపల
అతడు ప్రేతమా ? కడు ఇడుములుబడి లోని నరుడు
చనిపోయెనన్నటుల.

అనువాదము : శ్రీ బైరాగి

*  ★

# గ్రామ యువతీ

ఉన్మద యౌవన సే ఉభర్
ఘటా సీ నవ అసాఢ్ కీ సుందర్,
అతి శ్యామ వరణ్,
శ్లథ్, మంద చరణ,
ఇఠలాతీ ఆతీ గ్రామ యువతి
వహ్ గజ గతి
సర్ప డగర్ పర్.

సరకాతీ పట్,
ఖిసకాతీ లట్,—
శర్ మాతీ ఝట్
వహ్ నమిత దృష్టి సే దేఖ్ ఉరోజోం కే యుగ ఘట్

హఁసతీ ఖలఖల్
అబలా చంచల్
జ్యోం ఫూట్ పడా హో స్తోత సరల్
భర్ ఫేనోజ్వల దశనోంసే అధరోం కే తట్ ।

వహ్ మగ్ మేఁ రుక్
మానో కుఛ్ ఝుక్
ఆంచల్ సంభాల్తీ, ఫేర్ నయన ముఖ్
పా ప్రియ పద కీ ఆహట్,
ఆ గ్రామ యువక్
ప్రేమీ యాచక్,

# గ్రామయువతి ★ ★

ఉన్మద యౌవన భార మనోహారి
ఆషాఢ నవాంభోధర సుందరి

అతి నీల తనుద్యుతి
మంద చరణగతి
గ్రామ యువతి తన
తళుకు బెళుకుతో వలపు కులుకుతో
అరుదెంచెనదే! అదిగో చూడగదే!

చేలాంచలమును తొలగద్రోసికొని
జృంభిత వక్షోజముల చూచికొని
కాస్త సిగ్గుగనె

ఫేనోజ్జ్వలమై పిల్లవాగు గిరి
తటమునుండి భూతలి పడినలాగు
రదనోద్గతమై పెదవిపైన కొం
నవ్వు నివ్వటిల గ్రామయువతి అదె!

ఆగి మార్గమున
కాస్త వంగి తన
కొంగు సర్దుకొని
ప్రియు సవ్వడి విని

మొగము త్రిప్పుకొని
నిలిచె ప్రణయమతి
అదె గ్రామయువతి.

జబ్ ఉసే తాక్‌తా హై ఇకటక్
ఉల్లసిత
చకిత,
వహ్ లేతీ మూంద్ పలక్ పట్ ;
పన్‌ఘట్ పర్
మోహిత నారీ నర్ ;
జబ్ జల సే భర్
భారీ గాగర్

ఖీంచతీ ఉబహనీ వహ్, బరబస్
చోలీ సే ఉభర్ ఉభర్ కసమస్
ఖించతే సంగ్ యుగరస భరే కలశ్,
జల ఛలకాతీ
రస బరసాతీ,
బలఖాతీ వహ్ ఘర్ కో జాతీ,
సిర్ పర్ ఘట్,
ఉర్ పర్ ధర్ పట్,

కానోం మేఁ గుడ్‌హల్
ఖోంస్,- ధవళ
యా కుయీ, కనేర్, లోధ్ పాటల్,
వహ్ హర్‌సింగార్ సే కచ సంవార్,
మృదు మౌలసిరీ కే గూంథ్ హార్,
గవుఓం సంగ్ కర్‌తీ వన విహార్,
పిక చాతక కే సంగ్ దే పుకార్-
వహ్ కుంద, కాంస సే,
అమల్‌తాస సే,
ఆమ్ర మౌర్, సహజన, పలాశ సే,
నిర్జన మేఁ సజ్ ఋతు సింగార్.

పల్లీయువకుడు ప్రణయ యాచకుడు
తనను చూడగనె తన్వి సిగ్గుగొని
మోము దాచికొను.

ఊరి బావిపై ఉవిత చేదతో
నీరు లాగగా, చేలాంచలమున
డాగియు డాగని రసభర వక్షో
జాత యుగళ మది తొణికిస లాడగ
తలపైగల జల భర ఘటము నుండి
జలము తొణకగా సాగును కామిని
చెవిలో పాటల లోధ్ర సుమము నిడి
తలలో వెచ్చని పారిజాత సుమ
గుచ్ఛము కూరిచి, వకుళ మాలికల
గళమున చేరిచి — గోవుల కానెడి
కుసుమ కోమలి

పిక చాతకముల కలసి పాడుకొని
మొల్లపూలతో తెల్ల రెల్లుతో
రసాలములతో, పలాశములతో
నవ మోహనమగు వన వాటికలో
విహరించె నదే పల్లీ యువతి

యౌవన సుషమా శాలి శరీరము
శ్రమజనిత నవాంబుకణాక్త ముఖము
వ్రీహి మంజరీమంజుల శిరము
వెలయగ వచ్చును వారము వారము

తన్ పర్ యౌవన సుషమా శాలీ,
ముఖ పర్ శ్రమకణ, రవి కీ లాలీ,
సిర్ పర్ ధర్ స్వర్ణ శస్య డాలీ.
వక్షా మేందోం పర్ అతీ జాతీ.
ఉరు మట్ కాతీ,
కటి లచకాతీ,
చిర వర్షాతప హిమ కీ పారీ
ధని శ్యామ వరణ్,
అతి క్షిప్ర చరణ్,
అధరోంసే ధరే పకీ బాలీ.

రే దో దిన్ కా
ఉస్ కా యౌవన్ !
సపనా ఛిన్ కా
రహతా న స్మరణ్ !
దుఃఖోం సే పిస్,
దుర్దిన మే ఘిస్.
జర్జర హోజాతా ఉస్ కా తన్ !
ఢక్ జాతా అసమయ యౌవన ధన్ !
బహ్ జాతా తట్ కా తినకా
జో లహరోం సే హంస్ ఖేలా కుఛ్ క్షణ్ :

---

ఎద కదలింపగ
కటినటియింపగ
వర్షాబ్ద తరుణ
అతివేగ చరణ.

రెండునాళ్లదే దాని యౌవనము
క్షణస్వప్నమది, మరల స్మరింపము

దుఃఖాల నణగి, దుర్దినముల చెడి
జర్జరమై పోవు తత్ శరీరము
కూలునులే యువతాప్రాకారము.

అనువాదము: శ్రీ దాశరథి

---

* *

# సోనజుహీ

సోనజుహీ కీ బేల్ నవేలీ,
ఏక్ వనస్పతి వర్ష, హర్ష సే ఖేలీ, ఫూలీ, ఫైలీ,
సోనజుహీ కీ బేల్ నవేలీ!

ఆంగన్ కే బాడే పర్ చఢ్‌కర్
దారు ఖంభ్ కో గలబాంహీ భర్,
కుహనీ టేక్ కంగూరే పర్
వహ్ ముస్కాతీ అలబేలీ:
సోనజుహీ కీ బేల్ ఛబీలీ!
దుబలీ పతలీ దేహ్ లతర్, లోనీ లంబాయీ,
ప్రేమ డోర్ సీ సహజ సుహాయీ!
ఫూలోం కే గుచ్ఛోం-సే ఉభరే అంగోం కీ
గోలాయీ,
నిఖరే రంగోం కీ గోరాయీ
శోభా కీ సారీ సుఘరాయీ
జానే కబ్ భుజగీ నే పాయీ!
సౌరభ కే పలనే మేం ఝూలీ
మౌన మధురిమా మేం నిజ భూలీ,
యహ్ మమతా కీ మధుర లతా
మన్ కే ఆంగన్ మేం ఛాయీ:
సోనజుహీ కీ బేల్ లజీలీ
పహిలే అబ్ ముసకాయీ!

ఏక్ టాంగ్ పర్ ఉచక్ ఖడీ హో
ముగ్ధా వయ సే అధిక్ బడీ హో
పైర్ ఉఠా, కృశ పిండులీ పర్ ధర్,
ఘుటనా మోడ్ చిత్ర బన్ సుందర్,

# సన్నజాజి ★ ★

సన్నజాజి క్రొంబూదీవియ
క్రొన్ననలను కురియించినది
అన్ని దెసల వ్యాపించినది,
సన్నజాజి క్రొంబూదీవియ.

ముంగిటిలో పందిరి నెక్కి
స్తంభమ్మును కౌగిలించుకొని
బురుజుపైన మోచే యానిచి
చిరు నవ్వేను క్రొంబూదీవియ

బక్క పలచనో తరళ దేహమున
ప్రణయ రజ్జువటు ప్రాకి మోహమున
వలయిత పుష్ప గుళుచ్ఛములతో
వెలసిన తరుణారుణ కాంతులతో
విష విహీన నిర్మల భుజగము వలె
వెడలి వచ్చె భూవల్మీకము,

పరిమళాల డోలికలో ఊగి
ఈ మమతా మధుర లతా సతి
నా మానస మండపి ప్రాకెను
చిరు సిగ్గులు పరిమళింపగా
చిరు నవ్వేను నా హృదయములో
సన్నజాజి క్రొంబూదీవియ.

ఒంటికాలిపై లేచి నిలచినది
ముద్దరాలి కంటెను కడు పెద్దది

పల్లవ దేహీ సే మృదు మాంసల్,
ఖినకా ధూప్ ఛాఁహ్ కా అంచల్,—
పంఖ సీప్ కే ఖోల్ పవన మేఁ
వన కీ హరీ పరీ అంగన్ మేఁ
ఉర్ అంగూఠే కే బల్ ఊపర్
ఉడ్నే కో అబ్ ఛూనే అంబర్!
సోనజుహీ కీ బేల్ హఠీలీ
లటకీ సధీ అధర్ పర్ :

ఝాలర్‌దార్ గరారా పహనే
స్వర్ణిమ కలియోం సే సజ్ గహనే
ఝూంతే కఢీ చూనరీ ఫహరా
శోభా కీ లహరీ సీ లహరా,—
తారోంకీ సీ ఛాఁహ్ సాఁవలీ,
సీధే పగ్ ధర్ తీ న బాఁవరీ,
కోమలతా కే భార్ సే మరీ
అంగ భంగిమా భరీ, ఛరహరీ :
ఉద్భిద జగ కీ సీ నిర్ఝరిణీ
హరిత సీర, బహతీ సీ టహనీ :
సోనజుహీ కీ బేల్ :
చౌకడీ భర్ తీ చంచల హిరనీ :
ఆకాంక్షా సీ ఉర్ సే లిపటీ,
ప్రాణోం సే రజ తమ పే చిపటీ,
భూ యౌవన కీ సీ అంగడాయీ,
మధు స్వప్నోం కీ సీ పరఛాఁయీ,—
రీఢ్ స్తంభ కా వే అవలంబన్
ధరా చేతనా కర్ తీ రోహణ్—
ఆః, వికాస పథ పర్ భూ జీవన్ :
సోనజుహీ కీ బేల్,
గంధ్ బన్ ఉడీ, భరా నభ కా మన్ :

పదము నెత్తి తన ఊరువుపై నిడి
మోకాల్ మడచి నటీమణి పోలిక
పల్లవ మాంసలమైన వక్షమున
వెలుగు నీడలను పయ్యెద జారిచి
పర్ణ పక్షములు విచ్చి ఆడినది.

వనదేవత యీ సన్నజాజి లత
బొటన వ్రేలిపై చక్కగ నిలబడి
అటు గగనమ్మున కెగసి పోవునో
సన్నజాజి క్రొంబూదీవియ.

కడు పలుచని చీర ధరించి
కనక ముకుళముల గాజులు తొడిగి
శోభాలహారిక వలె విప్పారెను
అంగ భంగిమలతో విలసిల్లుచు
నా అంగణమున నొప్పారెను.

హారిత జలమ్ములతో పరువెత్తెడు
ఝరి వలె విహరించెను చల్లగ -
చెంగు చెంగుమని దుముకు లేడివలె
పరువెత్తును కోమల సుమ వల్లిక.

కాంతిపోలె హృదయము పెనవేయుచు
రాజస తామసములవలె క్రమ్ముచు
ఛాయాపావన మొట్టుల మెయి విరుచుచు
మధుర స్వప్నమ్ముల ఛాయలతో
నభో హృదయమున వ్యాపించుటకై
పరిమళమై పై కెగసెను వల్లిక.

మూల స్థూల ధరతీకే భీతర్
ఖీంచ్ అచేతన కా తమ దాహర్
వహ్ అపనే అంతర్ కా ప్రియధన్
శాంతి ధ్వజా సా శుభ్ర మణి సుమన్
కంపిత మృదుల హాథేలీ పర్ ధర్,
ఉఠా క్షీణ భుజవృంత ఉచ్చతర్,-
అర్పిత కరతీ, లో, ప్రకాశ కో
నిజ అధరోం కే అమృత హాస కో,
ప్రాణోం కే స్వర్ణిమ హులాస్ కో ;
సోనజుహీ కీ బేల్
సమర్పిత కరతీ అంతర్ముఖ వికాస కో
ఉర్ సువాస్ కో!

మానవ మన్ కర్ రహా ప్రతీక్షా
సోనజుహీ సే లే నవ దీక్షా,
ఉస్‌కే ఉర్ కే అంధ రాగ సే
ప్రాణోంకీ హరితాభ్ ఆగ్ సే
ఫూటే చేతన శుభ్ర శిఖా,
జో సకే దిఖా
మానవతా కా పథ్ ;
జీవన కా రథ్ ;
—బస్ ;
ప్రేమ హో జగ కా ఇతి అథ్,
త్యాగ జన సారథి అభిమత ;
సోనజుహీ దృష్టాంత్,—
మనుజ సంఘర్షోంసే శ్లథ్
రీధ్ కర్దమ మే లథ్‌పథ్॥

ధరణీ గర్భాంతరమున దాగిన
తమో భూతమును బయటకు త్రోయుచు
తనయందలి నవ నవ ప్రకాశమును
తన అధరమ్మున వెలయు హాసమును
జీవకోటిలో గల విలాసమును
కంపిత కర పల్లవముల నిడికొని
ఒసగుచున్నదదె, సన్నజాజిలత!

శుభ్ర శిఖా నవ చైతన్య ప్రభ
అభ్రంకషమై వ్యాపించునదే!
సన్నజాజి క్రొంబూవ్వివియలో
నున్న వెలుగు దశ దిశలనించు నదె!

ఈ స్వచ్ఛశిఖాజ్యోతియె చూపును
మానవతానవ విశాల పథమును,
అందున పరువిడు జీవన రథమును —

త్యాగమె రథ సారథిగా
ప్రేమమె జీవన విధిగా

సన్నజాజి క్రొంబూదీవియ!
సన్నజాజి క్రొంబూదీవియ!

అనువాదము : శ్రీ దాశరథి

## ★ ★ యహ్ ధర్తీ కితనా దేతీ హై

మైఁ నే ఛుటపన్ మేఁ ఛిప్‌కర్ పైసే బోయేఁ థే.
సోచా థా, పైసోం కే ప్యారే పేడ్ ఉగేంగే,
రుపయోం కీ కల్‌దార్ మధుర ఫసలేఁ ఖనకేం ,
ఔర్ ఫూల్ ఫల్ కర్, మైఁ మోటా సేఠ్ బనూంగా।
పర్ బంజర్ ధరతీ మేఁ ఏక్ న అంకుర్ ఫూటా,
వంధ్యా మిట్టీ నే న ఏక్ భీ పైసా ఉగలా!
సపనే జానే కహాఁ మిటే,కబ్ ధూల్ హో గయే।
మైఁ హతాశ్ హో, బాట్ జోహతా రహా దినోం తక్
బాల కల్పనాకే అపలక్ పాఁవడే బిఛాకర్।
మైఁ అబోధ్ థా, మై నే గలత్ బీజ్ బోయే థే.
మమతా కో రోపా థా, తృష్ణా కో సీంచా థా।

అర్ధ శతీ హహరాతీ నికల్ గయీ హై తబ్ సే।
కితనే హీ మధు పతఝర్ బీత్ గయే అన్ జానే,
గ్రీష్మతపే, వర్షాఝూలీ, శరదేఁ ముస్కాయీఁ,
సీ సీ కర్ హేమంత్ కంపే, తరు ఝరే, ఖిలే వన్।
ఔ' జబ్ ఫిర్ సే గాఢీ ఊఁదీ లాలసా లియే
గహరే కజరారే బాదల్ బరసే ధర్ తీ పర్.
మైఁనే, కౌతూహలవశ్, ఆఁగన్ కే కోనే కీ
గీలీ తహ్ కో యోం హీ ఉఁగలీ సే సహలాకర్
బీజ్ సేమ్ కే దబాదియే మిట్టీ కే నీచే।—
భూ కే అంచల్ మేఁ మణి మాణిక్ బాంధ్ దియే హోఁ।

# సుఫలా ధరిత్రి ★ ★

బాల్యమందు రహస్యముగ
పైసలు నాటితి భూమిని
చెట్లు మొలచి కొల్లలుగా
కోట్ల డబ్బు కాయు ననుచు

మరుభూమిని మొలవ లేదు
తరుణాంకుర మొక్కటియును
వంధ్యా భూమ్యుదరమ్మున
పండలేదు పైన గూడ.

నిరాశతో క్రుంగి పోతి
పరాజితుడ నై పోతిని
ఆశా సౌధము కూలెను
ఊహాలోకము వ్రీలెను
నే నాటిన విత్తనాలు
పూనలేదు నవ ఫలాలు
మమకారము నాటితినో !
తృష్ణకు నీర్పోసితినో !

నాటి నుండి యెబదేండ్లు
దాటిపోయె నిముసాలటు
గ్రీష్మర్తువు మండి పోయె
వర్షమ్మూయ్యాల లూగెను
శరదృతువు హసియించెను
వజవజ వణకించె హిమము,
వనములెల్ల కుసుమించెను
తరువు లెల్ల చివురించెను,
మరల నీల నీరదములు,
ధారమ్ముగ వచ్చి కురిసె.

మైం ఫిర్ భూల్ గయా ఇస్ ఛోటీ సీ ఘటనా కో,
ఔర్ బాత్ భీ క్యా థీ, యాద్ జిసే రఖతా మన్,
కింతు, ఏక్ దిన్ జబ్ మైం సంధ్యా కో ఆంగన్ మేం
టహల్ రహా థా - తబ్ సహసా మైం నే జో దేఖా
ఉస్ సే హర్ష విమూఢ హో ఉఠా మైం విస్మయ సే!

దేఖా, ఆంగన్ మేం కోనే మేం కయీ నవాగత్,
ఛోటీ ఛోటీ ఛాతా తానే ఖడే హుయే హైం,
ఛాతా కహూం కి విజయ పతాకాయేం జీవన్ కీ ।
యా హథేలియాం ఖోలే థే వే నన్హీ, ప్యారీ -
జో భీ హో, వే హరే హరే ఉల్లాస సే భరే
పంఖ్ మార్ కర్ ఉడనే కో ఉత్సుక్ లగతే థే,-
డింబ్ తోడ్ కర్ నికలే చిడియోం కే బచ్చోం సే!

నిర్నిమేష! క్షణభర్, మైం ఉన్ కో రహా; దేఖతా —
సహసా ముఝే స్మరణ హో ఆయా, కుఛ్ దిన్ పహిలే
బీజ్ సేమ్ కే రోపే థే మైంనే ఆంగన్ మేం,
ఔర్ ఉన్హీ సే బౌనే పౌధోం కీ యహ పల్టన్
మేరీ ఆంఖోంకే సమ్ముఖ్ అబ్ ఖడీ గర్వ సే,
నన్హేం నాటే పైర్ పటక్, బఢతీ జాతీ హై

తబ్ సే ఉన్ కో దేఖతా రహా, ధీరే ధీరే
అనగినతీ పత్తోం సే లద్, భర్ గయీ ఝూడియాం,
హరే భరే టంగ్ గయే కయీ మఖమలీ చందోవే,

మరల కుతూహలము విరిసె,
మా ముంగిట నొక్క మూల
తడి నేలను పెల్లగించి
చిక్కుడు గింజలు నాటితి
ధరణి కొంగులో మణులను
దాచితినో యన్నట్టుల;
నడచి పోయె కొన్ని నాళ్లు—
నాటిన విషయమే మరచితి.

ఒక సంధ్యావేళ ఇంటి
ముంగిట తిరుగాడు చుంటి,
ఆశ్చర్యము ! చూచినాడ
అటు మూలగ బయలు వెడలె
రొమ్ము విరుచుకొని వెలువడు
రెమ్మలుగా చిరు మొక్కలు

చైతన్య పతాక లేమొ,
చేతులు సాచుక లేచిన
చిన్ని చిన్ని బాలలేమొ,
వచ్చిరాని రెక్కలతో
గగనానకు నెగయ జూచు
పిచ్చుక పిల్లలో యెవో!

నిర్నిమేషముగా క్షణము
నిలచి చూచి నాడ, వాని !
ఏనాడో నాటి నట్టి
ఈ చిక్కుడు విత్తనాలు
వెలయించెను చిరు మొక్కలు
వేల సైనికుల వోలిక

రోజు రోజు కవి పెరిగెను,
హరిత పర్ణముల దాలిచి

బేలేఁ ఫైల్ గయీఁ బల్ ఖా, ఆంగన్ మేఁ లహరా, -
ఔర్ సహారా లేకర్ బాడే కీ టట్టీ కా
హరే హరే సౌ ఝురనే ఫూట్ పడే ఊపర్ కో, -
మైఁ అవాక్ రహగయా వంశ కైసే బఢతా హై,
ఛోటే, తారోంసే ఛితరే, ఫూలోం కే ఛీంటే
ఝాగోంసే లిపటే లహరీ శ్యామల లతరోం పర్
సుందర లగతే థే, మావస్ కే హఁసముఖ్ నభ్ సే,
చోటీ కే మోతీ-సే, ఆంచల్ కే బూటోం సే.

ఓహ్, సమయ పర్ ఉన్ మేఁ కితనీ ఫలియాఁ టూటీఁ।
కితనీ సారీ ఫలియాఁ। కితనీ ప్యారీ ఫలియాఁ, -
పతలీ చౌడీ ఫలియాం! ఉఫ్, ఉన్ కీ క్యా గినతీ।
లంబీ లంబీ అంగులియోం సీ, నన్హీఁ నన్హీఁ
తలవారోం సీ, పన్నే కే ప్యారే హారోం సీ,
ఝూఠ్ న సమఝేఁ, చంద్రకలాఓం సీ నిత బఢతీఁ,
సచ్చే మోతీ కీ లడియోం సీ. ఢేర్, ఢేర్ ఖిల్,
ఝుండ్ ఝుండ్ ఝిల్‌మిల్‌కర్ కచ్‌పచియా తారోం సీ!

ఆః ఇతనీ ఫలియాఁ టూటీఁ, జాడోం భర్ ఖాయీ,
సుబహ్ శామ్ వే ఘర్ ఘర్ పకీఁ, పడోస్ పాస్ కే
జానే అన్‌జానే సబ్ లోగోం మేఁ బఁటవాయీ,
బంధు బాంధవోం, మిత్రోం, అభ్యాగత, మంగతోం నే
జీ భర్ భర్ దిన్ రాత్ ముహల్లే భర్ నే ఖాయీ-
కితనీ సారీ ఫలియాఁ, కితనీ ప్యారీ ఫలియాఁ।

పచ్చ పట్టు తివాసీలు
పరచినటుల వ్యాపించెను,
గుబురు గుబురుగా లతికలు
అంగణమంతట నిండెను.
తామర తంపర యయ్యెను
వాని వంశ మెల్ల అపుడు.

చెదరి యున్న తారల వలె —
పుష్ప కేసరముల పట్టు
పుట్టమ్ములు కట్టి నటుల
వర్షకాల హార్షాంకిత
జలకణ మౌక్తికములతో
విరాజిల్లె నందముగా

ఎన్నో కాచెను కాయలు
పలుచని పచ్చని కాయలు
అసంఖ్యాకముగ కాయలు
సుదీర్ఘాంగుళుల మాదిరి.
చిన్ని చిన్ని ఖడ్గాలటు -
మరకత నవ హారములటు -
శుక్లపక్ష శశి కళ లటు
ప్రతి దిన వర్ధమానమయి
ముక్తాసరముల పోలిక,
చుక్కలవలె గుంపులుగా,
కాయలు కాచెను లతలు.

తింటిమి చలికాల మెల్ల,
పగలు రాత్రి వండిరింట
ఇరుగు పొరుగువారెల్లరు
ఎరిగిన వారెరుగని వా

యహ్ ధర్తీ కితనాదేతీహై ! ధరతీమాతా।
కితనా దేతీ హై అపనే ప్యారే పుత్రోం కో।
నహీం సమఝ్ పాయా థా మైం ఉస్‌కే మహత్వ కో।-
బచపన్ మేం, ఛి:, స్వార్థ, లోభవశ మైనే బోకర్,
రత్న ప్రసవినీ హై వసుధా, అబ్ సమఝ్ సకా హూం।।
ఇస్‌మేం సచ్చీ సమతా కే దానే బోనే హైం,
ఇస్‌మేం జన కీ క్షమతా కే దానే బోనేహైం,
ఇస్‌మేం మానవ మమతా కే దానే బోనే హైం,
జిస్‌నే ఉగల్ సకే ఫిర్ ధూల్ సునహలీ ఫసలేం.-
మానవతా కీ, - జీవన శ్రమనే హంసేం దిశాయేం। -
హమ్ జైసా బోయేంగే వైసా హీ పాయేంగే;

---

రెల్లరు బంధు బాంధవులు
మిత్రులు నభ్యాగతులును
వాడలోని వారు తినిరి
తృప్తిగాను ఆప్తులతో.

భూమాత యొసంగును తన
పుత్రులకెన్నెన్నిటినో:
బాల్యమ్మున నెఱుగనైతి
పవిత్ర ధరణీ మాతను
స్వార్థముతో నాటెమ్మల
నాటియుంటి దురాశతో

భూమిలోన నాటవలెను
నిజమగు సమతా బీజము,
మనుజ క్షమతా బీజము
మానవ మమతా బీజము.
ఈ బీజములందు నుండి
ఎగసి వచ్చు దండిగాను
మానవతా సస్య ఫలము.

ఏ తీరున నాటుదుమో
ఆ తీరున పొందుదుము.

అనువాదము: శ్రీ దాశరథి

★ ★

# నౌకా విహార్

శాంత, స్నిగ్ధ, జ్యోత్స్నా ఉజ్వల్ !
అపలక్ అనంత, నీరవభూతల్
సైకత శయ్యా పర్ దుగ్ధ ధవళ, తన్వంగీ గంగా, గ్రీష్మవిరళ,
లేటీ హై శ్రాంత, క్లాంత, నిశ్చల్ !

తాపస బాలా గంగానిర్మల్, శశిముఖ సే దీపిత మృదు కరతల్,
లహరేఁ ఉర్ పర్ కోమల కుంతల్ !
గోరే అంగోం పర్ సిహర్ సిహర్, లహరాతా తార్ తరళ సుందర్
చంచల అంచల్ సా నీలాంబర్ !

సాడీ కీ సికుడన్ సీ జిస్‌పర్, శశి కే రేశమీ విభా సే భర్,
సిమటీ హైఁ వర్తుల్, మృదుల లహర్ !
చాందనీ రాత్ కా ప్రథమ ప్రహర్,
హమ్ చలే నావ్ లేకర్ సత్వర్.

సికతా కీ సస్మిత సీపీ పర్ మోతీ కీ జ్యోత్స్నా రహీ విచర్,
లో, పాలే చఢీ, ఉఠా లంగర్ !
మృదు మంద్ మంద్, మంథర మంథర, లఘుతరణి, హంసినీ సీ సుందర్
తిర్ రహీ, ఖోల్ పాలోంకే పర్ !

నిశ్చల జల కే శుచి దర్పణ పర్ బింబిత హో రజత పులిన నిర్భర్
దుహరే ఊంచే లగతే క్షణభర్.

# నౌకా విహారము ★ ★

శాంతము, స్నిగ్ధము, జ్యోత్స్నోజ్జ్వలము!
నిశ్చల, నీరవ మీభూతలము.!
సైకత శయ్యాతలమున గంగా
భామిని దుగ్ధధవళ కాంతులతో

గ్రీష్మవిరళయై పరిశ్రాంతయై ఊర్పునించినది వవ్వళించినది.
తాపస బాలిక, నిర్మలగంగ,
శశిప్రభతో విలసిల్లెడు మోమున
ఉరమున కోమల కుంతలములు పడ,

ధవళ తనువుపై జలనీలాంబర
ముదము లొలుకగ ధరియించినది.
చంచలమగు జల చేలాంచలమున
శశికాంతుల జలతారు మెరసినది.

వెన్నెలరాతిరి మొదటి యామమున
వెడలినాము నౌకా విహారమున
సికతాతల సస్మిత శుక్తికలో
జ్యోత్స్నా మౌక్తికములు నిండారెను
తెరచాప బడెను, లంగరు లేచెను

మృదు మందమంద మంథర మంథర
లఘు తరణి, సుహాసిని సుందరివలె
తెరచాపల రెక్కలు సాచినదచె
ధరణీ తలమును దూరాన విడచె

కాలాకాంకర్ కా రాజ భవన్, సోయా జలమేఁ నిశ్చింత్, ప్రమన్.
పలకోం మేఁ వైభవ స్వప్న సఘన్ ;
నౌకా సే ఉఠతీఁ, జల హిలోర్,
హిల్ పడతే నభ కే ఓర్ ఛోర్.

విస్ఫారిత నయనోం సే నిశ్చల, కుఛ్ ఖోజ్ రహే చల్ తారకదల్,
జ్యోతిత కర్ జల కా అంతస్థల్;

జిన్ కే లఘు దీపోం కో చంచల్, అంచల్ కీ ఓట్ కియే అవిరల్,
ఫిరతీఁ లహరేఁ లుక్ ఛిప్ పల్ పల్,
సామ్‌నే శుక్ర కీ ఛవి ఝల్‌మల్, పైరతీ పరీ సీ జలమేఁ కల్,
రుపహరే కచోం మేఁ హో ఓఝల్,

లహరోం కే ఘూంఘట్ సే ఝుక్ ఝుక్, దశమీ కా శశి నిజ తిర్యక్ ముఖ్
దిఖలాతా, ముగ్ధా సా రుక్ రుక్
అబ్ పహుంచీ చపలా బీచ్ ధార్,
ఛిప్ గయా చాందనీ కా కగార్.

దో-బాహోం-సే దూరస్థ తీర్, ధారా కా కృశ కోమల శరీర్.
ఆలింగన కర్‌నే కో అధీర్.
అతి దూర్, క్షితిజ పర్ విటప మాల్, లగతీ భ్రూరేఖా సీ అరాల్,
అపలక్ నభ నీల నయన విశాల్.

మాఁ కే ఉర్ పర్ శిశు సా, సమీప్, సోయా ధారా మేఁ ద్వీప్,
ఊర్మిల్ ప్రవాహ కో కర్ ప్రతీప్:
వహ్ కౌన్ విహగ్ ? క్యా వికల కోక్ ఉడతా, హర్‌నే నిజవిరహశోక్-
ఛాయా కీ కోకీ కో విలోక్.

నిశ్చల జల నిర్మల దర్పణమున
ప్రతిబింబించెను రజత పులినములు
ద్విగుణీకృతములుగా కనిపించెను.

"కాలాకాంకర్" రాజ భవనము
నదీజలమ్ముల నిద్దురించినది
విస్ఫారిత నయనమ్ముల తారలు
జలగర్భమ్మున కాంతులు చిమ్ముచు
ఏమేమో వెదుకాడుచున్నయవి.

జల తరంగములు తమ అంచలముల
మాటున కాంతుల చిరుదీపమ్ముల
మలుగకుండ కాపాడుచున్నయవి.

శుక్రతార జలమున బింబించుచు
అచ్చర వలె తా హాయిగ నీదును
వీచ్యవగుంఠనమునుండి తొంగుచు
దశమినాటి శశి తనతెర్వబ్బుఖ
బింబము చూపును ముగ్ధాంగన వలె
పడవ చేరినది మధ్య ధారలో

దూర తీరములు బాహుద్వయమున
కృశకోమల వాహిని దేహమ్మును
కౌగిలించుకొనజాలకున్నయవి.

నభోనీల దయనోపరిసీమను—
అతిదూర క్షితిజమ్మున తరుతతి
అరాళ సుభ్రూరేఖలె యయ్యెను.

తల్లియొడిని శయనించు నిసుగువలె
ఉల్లసిల్లె నౌక తీవి నీటిలో.

పతవార్ ఘుమా, అబ్ ప్రతను ఖార్
నౌకా ఘూమీ విపరీత ధార్.

డాండోం కే చల్ కరతల పసార్, భర్ భర్ ముక్తాఫల్ ఫేన్‌స్ఫార్.
బిఖరాతీ జల మేఁ తారహార్.

చాందీ కే సాంపోం సీ రల్ మల్ నాఁచతీఁ రశ్మియాఁ జల్ మేఁ చల్
రేఖావోం సీ ఖించ్ తరల సరల్
లహరోం కే లతికావోంమేఁ ఖిల్, సౌ సౌ శశి, సౌ సౌ ఉడు ఝిల్ మిల్
ఫైలే ఫూలే జల మేఁ ఫేనిల్.

అబ్ ఉథ్‌లా సరితా కా ప్రవాహ్, లగ్గీ సే లే లే సహజ థాహ్
హమ్ బఢే ఘాట్ కో సహోత్సాహ్.
జ్యోం జ్యోం లగతీ హై నావ్ పార్
ఉర్ మేఁ ఆలోకిత శత విచార్.

ఇస్ ధారా సా హీ జగ కా క్రమ శాశ్వత ఇస్ జీవన్ కా ఉద్గమ్
శాశ్వత హైగతి, శాశ్వత సంగమ్,
శాశ్వత నభ కా నీలా వికాస్, శాశ్వత శశి కా యహ్ రజతహాస్,
శాశ్వత లఘు లహరోం కా విలాస్.

హే జగ జీవన కే కర్ణధార్ ! చిర జన్మ మరణ కే ఆర్ పార్,
శాశ్వత జీవన—నౌకా విహార్ !
మైఁ భూల్ గయా అస్తిత్వ జ్ఞాన్, జీవన కా యహ్ శాశ్వత ప్రమాణ్,
కరతా ముఝ్‌కో అమరత్వదాన్.

---

విరహియైన ఒక కోకము జలమున
తన నీడనె తా చూచి ఊరడిలు

పడవ వేగమున నడుపసాగినది.
ముక్తాఫల సదృశమైన ఫేనము
ముసరుకొన్నయది జలోపరిస్థలి.
రజత సర్పముల మాదిరి - జలమున

రేఖలుగా ప్రసరించును కాంతును
తరంగ లతికలలో సహస్రములు
శశితారా నవ సుమములు వెలసెను
నదీ ప్రవాహములోతు తగ్గినది,
నడచె పడవ తీరమ్ము వైపుగా
నావ తీరమును చేరుచుండగనె
నవాలోచనలు మదిని నిండినవి.

నదీధారవలె నున్నది లోక క్రమము,
శాశ్వతము జీవనోద్గమము
గతి శాశ్వతము, సమాగతి శాశ్వతము
శాశ్వతము నభోనీల వికాసము,
శాశ్వతము శశాంకరజతహాసము
శాశ్వతము తరంగాళి విలాసము

ఓ ప్రపంచ జీవన కర్ణధారి!
చిరజన్మ మరణ తీరాంతరముల
శాశ్వత జీవన తరణి విహారీ!

నాకమరత్వము దానము సేసెడి
నీ అస్తిత్వమె నే మరచితినో!

అనువాదము: శ్రీ దాశరథి

★ ★ ఏక్ తారా

నీరవ సంధ్యా మేఁ ప్రశాంత్
డూబా హై సారా గ్రామ ప్రాంత్ ।
పత్తోం కే ఆనత అధరోం పర్ సో గయా నిఖిల వన్ కా మర్మర్,
జ్యోం వీణా కే తారోం మేఁ స్వర్ ।

ఖగ కూజన్ భీ హో రహా లీన్, నిర్జన గోపథ్ అబ్ ధూలి హీన్,
ధూసర భుజంగ్ సా జిహ్మ, క్షీణ్ ।
ఝీంగుర కే స్వర కా ప్రఖర తీర్ కేవల్ ప్రశాంతి కో రహా చీర్,
సంధ్యా ప్రశాంతి కో కర్ గంభీర్,

ఇస్ మహాశాంతి కా ఉర్ ఉదార్, చిర్ ఆకాంక్షా కీ తీక్ష్ణ ధార్,
జ్యోం బేధ్ రహీ హో ఆర్ పార్,
అబ్ హువా సంధ్యా స్వర్ణాభ్ లీన్,
సబ్ వర్ణ వస్తు సే విశ్వ హీన్.

గంగా కే చల జల మేఁ నిర్మల, కుమ్హలా కిరణోం కా రక్తోత్పల్
హై మూంద్ చుకా అప్నే మృదు దల్.
లహరోం పర్ స్వర్ణ రేఖా సుందర పడ్ గయీ నీల్, జ్యోం అధరోంపర్
అరుణాయీ ప్రఖర శిశిర సే డర్

తరు శిఖరోం సే వహ్ స్వర్ణ విహగ ఉడ్ గయా, ఖోల్ నిజపంఖ్ సుభగ
కిస్ గుహా నీడ్ మేఁ రే కిస్ మగ్.

అపర నీరవ సంధ్యా మహాప్రశాంతి
పూరమున గ్రామమంతయు మునిగిపోయె,
వీణ తీగలతో స్వర వితతి యాగు
పగిది పత్రాంతతా ధర పంక్తిపైన
నిదుర వోయెను నిఖిల సునీరవమ్ము
విహగ రుతికూడ నడగె విన్పించకుండ.

వకృమై సన్నమై బూదివన్నె గాలి
మేపరి విధాన నిర్ధన గోపథమ్ము
పీత ధరణీ పరాగమై వెలయు నిపుడు.

నిశిత నారాచముల గతి నిగుడు కీచు
రాళ్ల కఠిన స్వనములు సర్వ ప్రశాంతి
నింత చీల్చియు సంధ్యా ప్రశాంతి కంత
కంత గంభీరతా ముద్ర హత్తు కొలుపు;

ఈ మహాశాంతి సముదార హృది నిదేదొ
చిరతరాశా కఠోర నిస్త్రింశధార
సాతంపుగ చీల్చుకొనిపోవు సరణి తోచు.

* * *

సంజ బంగరు కాంతి సమసిపోయినది
ఇల వర్ణ వస్తు విహీనమ్ముగాగ
పూత గంగా చలాంబువుల తాశిళ్ల
రంగేదు సంధ్యాంశు రక్తోత్పలమ్ము
కుదియించుకొనె తన మృదు దళమ్ములను.

ఖరశైశిరాభీల కర్షణమ్ములకు
నధర రక్తిమ భీతమై మాడినట్టు
లలలప్తె నొయ్యారములు పోవు సుంద
రాంత్య సంధ్యారేఖ యది నల్లనయ్యె.

మృదు మృదు స్వప్నోం సే భర్ అంచల్, నవ నీల నీల, కోమల కోమల్
ఛాయా తరు వన మేఁ తమ శ్యామల్.

పశ్చిమ నభ మేఁ హూఁ రహా దేఖ్.
ఉజ్వల, అమంద నక్షత్ర ఏక్.
అకలుష, అనింద్య నక్షత్ర ఏక్, జ్యోం మూర్తిమాన్ జ్యోతిత వివేక్.
ఉర్ మేఁ హో దీపిత అమర టేక్.

కిస్ స్వర్ణాకాంక్షా కా ప్రదీప్ వహ్ లియే హుయే కిస్‌కే సమీప్?
ముక్తాలోకిత జ్యోం రజత సీప్.
క్యా ఉస్‌కీ ఆత్మా కా చిర ధన, స్థిర, అపలక్ నయనోం కా చింతన్.
క్యా ఖోజ్ రహా వహ్ అపనాపన్.

దుర్లభ్ రే దుర్లభ్ అపనాపన్, లగతా యహ్ నిఖిల విశ్వ నిర్జన్.
వహ్ నిష్ఫల ఇచ్ఛా సే నిర్ధన్.
ఆకాంక్షా కా ఉచ్ఛ్వసిత వేగ
మాన్‌తా నహీం బంధన వివేక్.

చిర ఆకాంక్షా సే హీ థర్ థర్ ఉద్వేలిత రే అహరహ సాగర్.
నాచ్‌తీ లహర్ పర్ హహర్ లహర్.
అవిరత ఇచ్ఛా హీ మేఁ నర్తన కర్‌తే అబాధ్ రవి, శశి, ఉడగణ్.
దుస్తర ఆకాంక్షా కా బంధన్.

రే ఉడు, క్యా జల్‌తే ప్రాణ్ వికల్. క్యా నీరవ, నీరవ నయన సజల్,
జీవన నిసంగ రే వ్యర్థ విఫల్,

భూరుహోగ్రముల నింపులు గుల్కుచున్న
ఆ స్వర్ణ విష్కిరమ్మది రెక్కవిప్పి
ఏ గుహా నీడార్థ మెగిరిపోయినదో !

మృదు మధురమ్ములైన పాటలు స్వప్నములు
నిండిన యొడితోడ నీల నీలాతి
కోమల శ్యామలమ్మై మించుచుట్టి
కటిక చీకటి వనాంగణమ్మెల్ల గలమె.

* * *

పశ్చిమాకాశమున సముజ్జ్వల మమంద
మొక్క నక్షత్రమును చూచుచుంటి నేను,
అకలుష మనింద్య మది, పవిత్రదీప్తి
మూర్తిగొన్నట్లు, దవ్వులోన మొక్కవోని
పట్టుదల దీక్షితమ్మైనదగిలి, వెలుగు.

ఏ పరమ ధర్మ సంజ్ఞా ప్రదీప కళిక
నెవరికోసమ్ము పెట్టిన దయ్యె నీత?
ముక్తియుప్పొంగు లలమెన క్రొత్తశక్తి!

అక్షయమ్మనుదాత్త భాగ్యమ్మదెట్టి ?
యనిమిష స్థిర నియమ చింతన మదేమి ?
అరయ నాత్మీయతాన్వేషణార్థమేమొ !

దొరకునాత్మీయతయు నెంత దుర్లభంబు !
నిఖిల విశ్వమ్ము నిరిపెను నిర్గమని !
నిష్ఫలేచ్ఛావశమ్మున నిర్ధనమని !
ఈ తెగని యాత్రయున్నదే యిదియు నుచ్ఛ్వ
సిత మహా వేగమై వివేకత ను గొనదు.

చిరతరాకాంక్ష వలన సాగర మహార
తమ్ము నుద్వేలకల్లోలతతుల నూగు.
అవిరతేచ్ఛచే రవి శశి యఖిల తార
కలు నిరాటంక నర్తనగతిఁ దవర్చు.

ఏకాకినీ కా అంధకార్, దుస్సహ హై ఇస్ కా ఘోర భార్,
ఇస్ తే విషాద కా రే న పార్.
చిర అవిచల పర్ తారక అమంద్.
జానతా నహీం వహ్ ఛంద బంధ్.

వహ్ రే అనంత కా ముక్త మీన్, అపనే అసంగ్ సుఖ మేం విలీన్.
స్థిత నిజ స్వరూప మేం చిర నవీన్.

నిష్కంప శిఖా సా వహ్ నిరుపమ, భేదతా జగత్ జీవన కా తమ్,
వహ్ శుద్ధ, ప్రబుద్ధ, శుక్ర వహ్ సమ్.
గుంజిత అలి సా నిర్జన అపార్, మధుమయ లగతా ఘన అంధకార్,
హల్కా ఏకాకీ వ్యథా భార్.

జగమగ్ జగమగ్ నభ కా ఆంగన్ లద్ గయా కుంద కలియోం సే ఘన్,
వహ్ ఆత్మ ఔర్ యహ్ జగ దర్శన్



కోర్కెయను బంధమును తెగగొట్టలేము.

* * *

ఓ తారకా! నీదు నూర్పులలోన
నెటువంటి వికలత్వమిపుడు నుండెడివి ?
నీ మౌన నేత్రాల నీరమెందులకు ?
సంగ విహీన నిస్సార జీవనము
వ్యర్థమ్ము విఫలమ్ము పరికించిచూడ
ఏకాకితనమను నీ తమఃపుంజ
మూక భారమ్మును మోయ దుర్భరము.
ఈ విషాదమ్మున కేది పారమ్ము ?

* * *

అట్టి కాలమ్మునుండియు నవి చలమ్ము
మంద మాతార యెరుగదు బంధములను,
ఆదిమధ్యాంత రహిత మనంత కాల
జలధిలో విహరించు స్వేచ్ఛా ఝషమ్ము
తనదు నిస్సంగ సుఖములో మునిగినట్టి
ద్వైస్థిత నిజస్వరూప తేజోంగణమున
సంతతము క్రొత్తక్రొత్తలు సంతరించు.
నిశ్చలమైన శిఖవలె నిరుపమాన
మది జగజ్జీవన తమస్సు నట్టె చీల్చు.
శుద్ధమది. ప్రబుద్ధమ్మది. శుక్రమది. స
మత్వమది - ఝుంకరించెడు మధుపగతి త
మస్సు చూడు మపారమ్ము మధు మయమ్ము
నయ్యె నిప్పుడే కాకితా వ్యథ తొలంగ.
చూచుచుండగనే దివ్య శుద్ధ ధవళ
తారకా కుందమాలికోదారమైన
ఆకసమ్ము జిగేల్ జిగేలనియె - నాత్మ
దర్శనమ్మది! - ఇది జగద్దర్శనమ్ము!

అనువాదము : శ్రీ నాయని సుబ్బారావు

★ ★

# జన్మ దివస్

ఆః పావన్ నిదాఘ్ అబ్ బీతే
జీవన్ కే కలశోం-సే రీతే?
పావన్ మధు నిదాఘ్ అబ్ బీతే

గతయుగ కే ఐశ్వర్యచిహ్నసే, మధు కే అంతిమ్
తామ్ర హరిత కుఛ్ పల్లవ, కుఛ్ కలికోరక్ స్వర్ణిమ్
జాడేసే సికుడే, డాలోం పర్ బిలమాయే థే,
రజత కుహాసే పట్ మేం లిపటే అలసాయే థే,
ధరతీ పర్ జబ్ శిశునే పహలే ఆంఖేం ఖోలీం!
(ఆంగన్ కే తరుపర్ తబ్ క్యా గిరికోయల బోలీ?)

విజన పహాడీ ప్రాంత, హిమాలయ కా థా అంచల్,
స్నేహక్రోడ్ శైశవ కా గిరిపరియోం కా థా ప్రియస్థల్;
ధూప్ ఛాంహ కా స్వప్ననీడ్, శ్యామల, స్మృతి కోమల్,
వన ఫూలోంకా గంధ దోల్, ఋత్ మారుతచంచల్.
నవప్రభాత వేలా థీ, నవజీవన అరుణోదయ్.
విగతశతీ థీ భుక్తప్రాయ్, యుగసంధి కా సమయ్,
ఓస్ హారీ హీ థీ, తృణ తరు కీ పలకోం పర్ జల్,
మాతృ చేతనా శిశు కో దే ప్రాణోం కా సంబల్
అంతర్హిత జబ్ హుయీ — భాగ్య ఛల్ కహియే విధిబల్
జన్మ మరణ ఆయే థే, సంగ్-సంగ్ బన్ హమ్‌జోలీ
[illegible] అంక మేం జీవన్ నే జబ్ ఆంఖేం ఖోలీ.

# జన్మ దినము

★ ★

పబదియు నాల్గు గ్రీష్మంబు లేగె బ్రతుకు
దొన్నియల జాఱు నుదకబిందువుల పోల్కి

*   *   *

గత యుగముల పై భవగత గాథలవలె
ఆమని తుది కెంపు పసిడి యాకులవలె
చలికి ముడిగి బంగరు సుమంబులును తడసె
వెండి పొగమంచు వలువలు వేసరిలెను
బుడుత డాదిగ పుడమిపై బడినవేళ
కోకిలము కూసెనో లేదొ గురుతులేదు

నిర్జనగిరి హిమానీ శిలాంగణమది
శైశవ స్నేహ ప్రశాంత వేది
నగసుర కన్యలు నడయాడు భూములు
వెల్గు నీడలు స్వప్న విహాగి కుటులు
స్మృతిశాద్వలస్థలి, మృదు సుగంధము గ్రోలి
మెరపు ఋతువుల తెమ్మెరలు గదలు
తొలిప్రొద్దు వేళలో తొలి జీవనమ్ముగా
అరుణోదయము ప్రియమై చెలంగె

గతము ముగియింపు, సమయ సంక్రాంతివేళ,
పసిడి మంచులు, తృణముపై బడిన జలము,
మాతృచేతన ప్రాణముల్ మార్చి నిసువు
కప్పగించి యంతర్హితంబైన దపుడె.

నియతియో విధి బలితంపు నిశ్చయమ్మొ,
జన్మ మరణమ్ము లిదియేమి సరస సరస

౫. సమదృష్టి ప్రకృతి ! విషణ్ణ అంగన మేఁ స్వర్గిక స్మితిభర్
ఫూల్ ఉఠే థే ఆడూ, లలఛాహే మకులోఁ మేఁ సుందర్
సేవోం కీ కలియాఁ ప్రఘాత, రక్తిమ ఛీంటోం సే శోభిత్
ఖిలీఁ మంఝోలే రజత ఫలోంమేఁ కరతీ థీఁ మన మోహిత్
పణియోం కీ ప్రముదిత పంఖడియాఁ ఉడతీ థీ పిఛవారే,
మహకీ రహే థే నీంబూ, కుసుమోంమేఁ రజగంధ సఁవారే
నారంగీ, అఖరోట్, నాక్ కే ఫూల్, మంజరీ, కలియాఁ।
బఢా రహీథీఁ ఋతు శోభా, కేలే కీ ఫూలీ ఫలియాఁ
కాఫల్ థే రంగ్ రహే, ఫూల్ మేఁ థీ ఫల్ లియే ఖువానీ,
లాల్ బురూసోంకే మధుఛత్తోంసే థీ భరీ వనానీ.
హఁసతీ థీ ఘాటియాఁ హిసాలూ ఖిలే సుసహాతే క్షణ మేఁ
బేడూ థే బైఁగనీ, లసలసే పకే అఛ్ పకే వన మేఁ
లదే అమారాయే గుచ్ఛోంమేఁ థే జంగలీ మూంగి దానే,
టూట్ రహే థే తోతే ఖట్ మిట్ఠే వన్-మేవే ఖానే
దేవదారు కుంకుమ కా స్వర్ణిమ టంగా సహన్ మేఁ థా నభ్,
మూక నవాగత కా కరతీ థీ శైల ప్రకృతి అభినందన్
వర్షోం బాద్ కిశోర్ హువా ఇన్ దృశ్యోం కే ప్రతిచేతన్

సోతా థా క్యా ధూంక్ రాత్ భర్ ఝబరా కాలూ పాజీ?
మస్త ఛోటియా శేర్, బాఘ్ సే లీ థీ జిస్ నే బాజీ?
సీసీ సీటీ బజా, ఆ రహా హోగా భాజీ దేనే
మంగల్ బావర్చీ కా నట్ ఖట్ లడకా పైసే లేనే
ఉమడ్ చీటియోం—సే, కిల్ బిల్ కర్, మాలీధర్ సిజ్ డలియాఁ
చునతే హోంగే హరీచాయ్ కీ బటీ సున్ హారీ కలియాఁ

చేయియుం జేయికలిపి నెచ్చెలుల పోల్కి
నడిచె, మృత్యువుదరి జీవనమ్ము పాడిచె.

సమదృష్టి ప్రకృతీ! విషణ్ణమయిన నీ గృ
        హమ్మునగూడ హాసమ్ము దోగు
దోరగా నుగ్గి చిటారుకొమ్మల నేరెలు
        రేగు అక్రోట్టు మారేడు పండ్లు
అంటు మామిడియు ననంటిబోదెల జుట్టి
        సాగు గుర్విందల తీగె వలపు
మధువు దొన్నియల జుమ్మనిరేగు మతీక
        లోయలన్నింపె కల్లోల రవము

పులుపు దీపియు గోరుకు రాచిలుక హాయలు
దేవదారులు శేకులున్ చేవదేలి
నిఖిలసృష్టియు కొంగ్రొత్త నిసుగు కొరకు
స్వాగతమ్ములు పల్కె సుస్వాదరుతుల.

మొరగి రేలిపుడె కన్ మొగిచె తుంటరిజాకి
        చిరుతను దెబ్బతీసిన సివంగి
ఈల నూదెనో కూర లీయవచ్చెనో వంట
        కూలిని గుంటడు గుంజె రూక
కొండ నెత్తముల పైనుండి గంపను ద్రోసి
        ఆకులన్ గోయు తేయాకు మాలి
ఇలమ్రొక్కి గంగు పళ్ళికిలించె "నా దొరా!
        పిసరంత లేదాస పింఛనొకటె

చేతులుం గాళ్లు సరుగుడు చెక్కలట్లు
వణకు చున్నవి నీటి కావడులు జూచి

హాథ్ జోడ్‌కర్, బకతా హోగా ఖడా మస్టరా విస్నా
అబ్ హుజూర్, పెంసన్ మిల్ జాయ్, ఔర్ నహీఁకుఛ్ తిస్నా.
ధౌలీ కే సీఘోం సే కంపతే హాథ్ పైర్ కర్ లక్‌లక్
పానీ కే బహంగే లానే మేఁ సాఁస్ ఫూల్ జాతీ థక్
జాదే సే హడ్డీ బజతీ,—సర్‌కార్, హువా బూఢా తన్,
మౌనా కే ఛత్తే కరతే పూటే కానోం మేఁ భన్‌భన్
అబ్ మోతీపర్ జీన్‌కసేగీ? దేఖేఁ ఆప్ కిసీ ఛిన్,
కాన్ ఖడేకర్, టాప్ ఉఠాయే, కరతా ఢిన్‌భర్ హిన్‌హిన్
ఆగే కే సబ్ దాంత్ నికల్ వహ్ చుకా సాథ్ చారే కే,
పీఠ్ ఝుక్ గయీ, పెంసన్ కే దిన్ అబ్ ఉస్ బేచారే కే.
హీఁ హీఁ హఁస్, జుట్ గయా కామ్ మేఁ హోగా తురత్ లగన్ సే,
భృత్య పురాతన్, శుభదిన్ కీ కర్ మౌన్ కామనా మన్ సే.

నిశ్చయ్ హీ, కటతీ హోగీ తబ్ జా గేహూఁ కీ వాలీ,
కటిమేఁ ఖోఁస్ దరాతీ, సిర్ పర్ ధర్ సోనే కీ డాలీ,
జాతీ హోగీ ఖేతోంమేఁ ప్రాతః మఖమల్ కీ చోలీ,
మార్ ఛీంట్ లహంగే మేఁ ఫేంటా, బహూ గాఁవ్ కీ భోలీ.
ధోరోంకే సంగ్ నికల్ చోకరే ఖులే హరే గోచర మేఁ
రోల్ మచాతే హోంగే, ఖేల్ ఖబడ్డీ హో హో స్వరమేఁ
ఉచక్ చౌంక్ ఖరహే ఝూడీ మేఁ ఛిపతే హోంగే డర్ సే,
హిరన్ చౌకడీ మార్, భాగతే హోంగే చకిత ఉధర్ సే
కంధే సే టాంగీ ఉతార్ కర్, హాథ్ కనపటీ పర్ ధర్,

ముగ్గె తనువు, చలివలె ఎమ్ములను గొరుకు
నెల్ల ఋతువులు, చెవిమ్రోయు నీగయట్లు.

"ఈ ముసలి తత్తడి పయి నింకెట్లు జీను
కట్టెదో దొర! డెక్కలు గొట్టిచూచు.
కసవుతోపాటు మొదటి పల్వరుసగూడ
మెసవికొన్నది ముదిసిన పసర మిద్ది,

"నడుము వంగెను పింఛను ముడుపొకండు
కలదు నాకు దిక్క"ని గరగరగ నవ్వి
తూలి సోలుచుబోవు, గాబోలు గంగు
ప్రాత నౌకరు భావి విశ్రాంతి గోరి

పయట కొంగును చుక్కపరికిణిన్ మెలివైచి
పొలమేగు పంటకాపుల పడంతి
గొడ్డ లావల ద్రోసి కూనిరాగము దీసి
తిరుగు కాపరుల కందరము లవ్వి
పసులవెంబడి చన్న పల్లెకుర్రల చెడ్గు
డాటకు పులికూడ నదరిపోవు
ముక్కుబేసరి పిల్ల మురువున కీసూని
రాచిల్క కారము రాచికొనెను

ఆకు సవ్వడియైన చీకాకుబడెడు
లేళ్ళు కుందేళ్లు పుల్గులు క్రేళ్లనురుకు
నట్టితావుల నొకపాట యాగి యాగి
దిగువ లోయలనుండి ప్రతిధ్వనించు.

మెరపు మెరసె మబ్బులలో
మంకెన పుష్పాలు విరిసె తోటలలో
నీవు నాడు నెమ్మదిలో

గాతాహోగా గవయీ ఫైలా ఖడా కిసీ చోటీపర్
ఘాస్ ఛీలతీ హోగీ హరీ తలైటీ మేం నథవాలీ
దేఖ్ సువా కో ఛాయీ హోగీ ఆంఖోం మేం హరియాలీ.
ఛేడీ హోగీ మస్త తాన్ స్వర మిలా ముఖర మర్మర్ సే.
మధుర ప్రతిధ్వని ఆయీ హోగీ ఘాటీ కే భీతర్ సే.

బిజలీ బసతీ ఘన్ మేం,
ఆగ్ లగాదీ ఖిల్ బురూస్ నే వన మేం తూనే తన్ మేం
మేహందీ పిసతీ సిల్ మేం
తూ న దేఖ్ పాయే, తేరీ హీ రంగత్ టూటే దిల్ మేం
మన్ ఉడతా పాంఖోం మేం,
సువా ఘూమతా వన్–వన్, తూ ఘూమా కరతీ ఆంఖోం మేం
సాంఝ్ హుయీ ఆంగన్ మేం,
తుఝే దేఖ్ కైసే బతలావూం క్యా హో జాతా మన్ మేం
బదలీ ఛాయీ దిన్ మేం
నయీ ఉమర్ కీ బాఢ్ నవేలీ ఉతర్ జాయగీ ఛిన్ మేం

మీఠే స్వర్ మేం దేతీ హోగీ ప్యార్ భరీ ధని గాలీ,
క్యా ఖాకర్ ఖుఖ్ పురే, కరేగా తూ మేరీ రఖవాలీ
సాస్ సింహనీ సీ హై మేరీ, ససుర్ ఏక్ మేం సౌ–సే,
జేఠ్ బైల్–సే హైం మతవాలే, దేవర్ మేరే గౌ–సే
సైంయాం మేరే కామధేను–సే మైం జావూం బలిహారీ,
వే చందన్ మైం గంధ–భాంహ్రా, వే చందా మైం, ఉజియారీ
వే హిరనా మైం హిరనీ, పీతే మిల్ ఝరనే కా పానీ,
తూ ప్యాసా తో ఖోజ్ కహీం జలధార్, మూర్ఖ్, అజ్ఞానీ

గోరింత రాతిమీద నలిచి క్రొం
జాయ జీవనాన మెలిచి
చానా! నన్నొకసారి కనవు, నీ
చూడ్కి నిలిచె హృదయములో

మనసు ఎగిరి రెక్కలలో రా
చిలుక కూసె కొమ్మలలో
తిరుగాడుచుందు వయ్యారే!
తనియింపులేని కన్నులలో

నా వాకిట మలుసంజె జేర
నా హృది కేమగునో నిన్ను జూచి
పగలే పఅమొయిలు స్వారు
లీపాటికి వెనుకాడి యాడు
క్రొంబ్రాయపు తే వరదపొంగు
లావంతలోనె తీసిపోవు.

పొలతి మెత్తగనెత్తి పొదుచు గాబోలు న
న్నేలాగు సాకెద విట్లుమాడ్కి
నా యత్త బెబ్బులి, నా మామ గండడు,
మా బావ యేనుగు. మరది గోవు,
కామధేనువు వంటి కాంతుడు నానోము
పంట మేల్ గందంపు పరిమళమ్ము
చందమామై తాను చంద్రికనై నేను
లేళ్లమై తిరిగేము - పళ్లుకేళ్లు

దొడ్డవీరుడ! నాయాడు బిడ్డయనెడి
ఉరగినిన్ బట్టువో సన్న మురళియూది

నదీ మేరీ కాలీ నాగిన్, జీ హో ఉసే ఖిరూ తూ,
పీర మరద్ జో, బీన్ బజాకర్ పహిలే ఉసే రిరూ తూ,
ఔర్ నహీఁతో, క్యా చుల్లూ భర్ పానీ తుఝే నహీఁ హై!
బహతీ గంగా ఛోడ్ కహాఁ జావూఁ ధని, క్యా న సహీ హై?
గూంజ్ రహీ హోఁగీ, గిరి వన అంబర మేఁ దుహరీ తానేఁ
ఔర్ పాస్ ఖించ్ ఆయే హోంగే, దో జన్ ఇసీ బహానే

హాఁ, తబ్ ఉషాస్వర్గ క్షితిజ పర్ స్వర్ణిమ మంగళ ఘట భర్
ఉతరీ థీ యుగ ఉదయ శిఖర పర్ మాణిక్ సూర్య ముకుట ధర్.
పహలే నే జగ్ కర్ ఖగ, ఊంచే గిరివాసోం కే కారణ్,
గాతే థే నవస్వర లయగతి మేఁ నవల జాగరణ చారణ్
నీల, ప్రతీక్షా థా నీరవ్–అనురాగ ద్రవిత థే లోచన్,
గంధ తుహిన్ సే గ్రథిత రేశమీ పట్ - సా మసృణ సమీరణ్
రంగ్ రంగ్ కే వనపూలోం సే గుంఫిత మఖమల్ కే శాద్వల్
తల్ప సంజోయే థే స్మిత్ శైశవ కే హిత, క్రీడా కోమల్
దేఖ్ రహా థా ఖడా నికట హీ హిమవత్ నవ జన్మోత్సవ్,
గౌరవ సే ఉన్నత కర్ మస్తక్, బరసా ఆశీర్వైభవ్
అమరోం కా అధివాస్, పుణ్య శిఖరోం సే అక్షయ కల్పిత్,
సాత్విక ఆత్మోల్లాస, చేతనా మేఁ ఏకాంత సమాధిత్.
స్వర్గిక గరిమా మేఁ ఉత్కర్ నైసర్గిక సుషమా మేఁ స్థిత్
స్ఫటిక శృంగ నిర్వాక్ నీలిమా మేఁ థే స్వర్ణ నిమజ్జిత్,
ఉతర్ రహా థా హేమగౌర చూడోంపర్ మౌన అతంద్రిత్
జ్యోతికాయ చైతన్య లోక - సా, నవప్రభాత దిక్ ప్రహసిత్!

యనుచు కదిసిన జంటల యాగడంబు
పుడమి మిన్నులనూచు కాబోలు నెపుడు.

దిగిరయె నుషస్సు స్వర్ణశుభ్రదివ్యసహాః పరిపూర్ణ కుంభమో
రగిలగవాంచి సూర్యుని శిరస్థలిదాల్చి.యుగోదయాద్రి ఊ
ర్ధ్వగిరులనుంట మున్నె ఖగపంక్తులు సవ్య లయస్వనోల్లస
ద్గగన విహార చారణ నికాయములై వినిపించె గీతముల్.

నీరవమైన కన్నుగవ నిండిన నీలనిరీక్ష, సాంద్ర నీ
హార సుగంధముల్ బొదివి యల్లిన పట్టుబలెన్ సమీర మిం
పారు సుమాళి గుంఫితములై మఖమల్లులబోని శేలనా
గారపు శావ్వలస్థలుల గవ్యములే శిశు తల్పసూములో.

అమర లోకస్థుల కధివాస యోగ్యమ్ము
సుకృతాశ్రయ శిఖర చూచుకమ్ము
సాత్వికమ్మగు నాత్మ సత్వ సముల్లాస
మమృత చైతన్య రహస్యమాధి
స్వర్గోన్నతుల నుండి సారి.పబడి పృథ్వి
దరుల నిలిచిన సౌందర్యగరిమ
నింగినీలిమల మునింగి స్వర్ణములోన
మౌనమైయుండు నెద్దాని కొమ్ము

లట్టి మహిమాన్వితాద్భుత మా హిమాద్రి
అతి సమీపము నిలుచుండి యలఘు బాహు
శీర్ష శీర్షంబులెత్తి యాశీస్సు గురిసి
ముదమునన్ జూచుచుండె జన్మోత్సవంబు.

ఫహరాతే థే ఆరోహోం పర్ నీహారోం కే కేతన్,
శుభ్రారుణ ఛాయాతప కంపిత, రశ్మిజ్వలిత నవ చేతన్
అతల గహన ఢాలోంసే జగ ఉత్కర్షోం మేఁ నభచుంబిత్
ఆధ్యాత్మిక పరివేష శాంత, లగతా థా విస్మయ స్తంభిత
తభీ అగోచర అంతరిక్ష మేఁ అంతర్జగ కే భీతర్
నయే శిఖర్ థే నిఖర్ రహే శత సూక్ష్మవిభవ కే భాస్వర్.
జిన్ పర్ నూతన యుగప్రభాత్ థా ఉదయ కో రహా గోపన్,
రజతనీల స్వర్ణారుణ శృంగోం పర్ భర్ స్వర్గిక ప్లావన్.
నయీ శతీ థీ జన్మ లే రహీ కాల దృష్టి మేఁ జీవిత్
స్నేహమూర్తి సీ విగత శతీ థీ కృచ్ఛ్రవేదనా మూర్ఛిత !

నవచేతనా థా అభినవ, మానస శత సా పుణ్యపురాతన
నాలముకుల, . పర్ ఇసీకా స్మృతి పావన సంబంధ సనాతన
శిశు నిమిత్త థా, నవ యుగ థా అవతరిత హో రహా నిశ్చయ.
బహిరంతర కా ధూమ్ ఛోర్ హఁసతా థా నవస్వర్ణోదయ.
ఇసలియే, సంభవ, హిమాద్రికా స్వర్గోన్ముఖ ఆరోహణ్
యుగ సనాభి శిశు కే మనకే హిత రహా మహత్ ఆకర్షణ్!
ఇంద్ర చాప కే జ్యోతి సేతుపర్ నవస్వప్నోం కే పగధర్
వివరా వహ మోహిత శృంగోం పర్ శోభా తన్మయ అంతర్.
మహిమాన్విత కర్ మనఃక్షితిజ కో దృష్టి తరణి కో విస్తృత
దీపిత కర్ తే థే శైశవ పథ సౌమ్య శిఖర దిక్ శోభిత్
ముగ్ధ ప్రకృతి ఛవి నవకిశోర మానస్ మేఁ తిరతీ థీ నిత
స్వర్ణ అప్సరీ సీ తుషార్ సరసీ సుషమా మేఁ బింబిత్.

దిగుచుండె నొక కాంతిదేహము చైతన్య
లోకమట్టుల గిరిలోయలందు
నవవిభాత హరిత్తు లవని హసించె ని
శ్రేణి నెగిరె హిమసిత పతాక
కంపించె శుభ్రరాగచ్ఛాయ లీరెండ
లచ్ఛమై వెల్గె మేలైన చిత్తు
అతలగభీరతాస్మృత జగదుత్కృష్ట
ములు ముస్తగొనె నభ మ్మంర వింత

అపుడగోచర మంతరిక్షాంతరమున
క్రొత్తయుగమును నిల్పు కొంగ్రొత్త యుషను
రజత నీలహేమముల నీ రద్ది విరియ
సూక్ష్మ నవశృంగములు పొడ చూపుచుండె.

నవశతాబ్ది వచటి, నవలు దొడ్డుచునుండె
కాలదంష్ట్రాహత గాక నిల్చి
గత శతాబ్దము కృపాకృతియు నస్నేహమై
మూల్గుచుండెను కృచ్ఛ్ర మూర్ఛద్రెళ్ళి
నవనవోన్మేషిణి నవ్య చేతన గాని
చిర చిరంతన హృదుచ్ఛిష్టశవము
అవి, నాశముకుశమ్ములైన నేమాయలే
ప్రాన స్మృతిలత సనాతనమ్ము

మాణవకుడనుట నిమిత్తమాత్రమేను
చూడగా నొక్క యుగసుప్రసూతి యద్ది
గ్రుచ్చి బహిరంతరముల కారొక్క పొగలు
భవ్య నవకాంతి నవ్వుచు బయలు మొలిసె.

కాంప్ కాంప్ కర్ అంగన మేం కొపేం గాతే థే స్వాగత,
గుహ్యాశక్తియాం తబ్ అలక్ష్యమేం నిశ్చయ ఏంంగే జాగ్రత్.
అవచేతన నిశ్చేతన హీ హోనా థా యుగ కే మంథిత,
మానస్ కో ఉన్నతి, దేహాకే జడ అణువోం కోజ్యోతిత.
చిర విభక్తికో యుక్తి, రుద్ధ కో ముక్తి, ఖండ కో పూరిత
ధరా విరోధోం కో హోనా థా విశ్వైక్య సంయోజిత
కుత్సిత కో సుందర, సుందర కో బననా థా సుందరతర
శివ కో శివతర, లోక సత్య కో మానవసత్య మహత్తర
దూర్ కహీం ఫిరతే థే, సంభవ, ధీరే, క్రాంతి బలాహక్,
రక్తిమ లపటోంకే పర్వత, భూ కే నవజీవన వాహక్.
ఘుమడ్ రహీ థీ క్రుద్ధ ధరా ఉర్ మేం హుంకార్ భయానక్,
జ్వాలాముఖీ ఉగల్‌నే కో థా రుద్ధ ఉదర్ కా పావక్
ఝంఝా కా థా జన్మ దోల్ వహా, ఋతు కుసుమోంనే గుంజిత్,
ప్రళయసృజన్ థే సాథ్ ఖేల్‌తే,—ప్రభు కీ దయా అపరిమిత్.
నహీం జన్‌తా, కబ్ కృతార్థ హోగా భూ పర్ నవచేతన్,
తమ పర్ అమర ప్రకాశ్ మృత్యుపర్ విజయీ శాశ్వత జీవన్.
హిమవత్ కా విశ్వాస అటల్‌రే, నవప్రభాత కీ ఆశా,
నీల మౌన మేం ఖోయే శృంగోంకీ అనంత జిజ్ఞాసా,
ప్రళయక్రోధ్ మేం ఖీంచ్ ప్రౌఢశిఖ అమృత ప్రాణ ప్రద్‌శ్వాసా,
ఘృణాద్వేషమేం రియేహృదయ మేం మహత్ ప్రేమ అభిలాషా.

అది కాబోలును హేతు వద్రి సురసౌధారోహణోత్సాహియై
కదలంబారె నదే సనాభి శిశుకున్ కల్పాంతపూత్కర్షణం
బుదయించన్ గతమయ్యె, స్వప్న చరణంబుల్ దాల్చి శృంగమ్ములన్
గదలెన్ చారుసురేంద్ర చాపధృతమై కామ్యప్రభాస్వాంతమై.

మురియింపించి మనోంతరాళమును దృశ్యమ్ములమ్ముకున్ విస్తృతిన్
పురమాయించి నవోచ్చశైశవపథమ్ముల్ విప్పి దీపించె త
ద్గిరి శృంగమ్ముల ముగ్ధసృష్టి సుషమల్ క్రీడించె కౌమార హృ
త్పరివేషమ్ముల దేవకన్య హిమపుంబాథోధి ఝంపించెనో.

కావ్ కావుమని యుషఃకాకము లుదయ వా
క్కును పాడి మేల్కొల్పె గుహ్యశక్తి
అవచేతనను మౌనమనుట కావలె యుగ
మంథనస్ఫూర్తి సమ్మార్జితమ్ము
మనసు కున్నతి, తనువునకు క్రొన్నవకంబు
గలుగవలె విభక్తి కలసియుంట
ముక్తమై బద్ధంబు పూర్ణమై ఖండంబు
సకల సిమ్మోన్నను లొకటియగుట

కుత్సితము కోమలముగను, కోమలము మ
రింత కోమలము, శుచి మరింత శుచియు
లోకసత్యము మానవాలోకముగను
మార్పులం గోరు విశ్వ సమైక్యభక్తి.

దూరానన్ చలియించుచుండె నెవియో ధూమంబు లుత్క్రాంతి మా
లారాగమ్ములు, శోణశైలములు, మర్త్యస్థావనీ జీవనా
ధారప్రావృకసంఖ్య మేఘములు, సంధానించి ఘూకాంక వహం
కారధ్వానము రుద్ధగర్భ మగలన్ గల్పించె నే జ్వాలనో

శోక్ రహా థా యుగ వినాశ మేఁ నవజీవన అభిలాషా,
విశ్వహ్రాస మేఁ నవలచేతనా సృజన ప్రేరణా, భాషా

హాఁ, చౌవన్ నిదాఘ్ అబ్ బీతే,
రిక్త అమృత - విష్ కే మటకోం-సే మితే తీలే,
చౌవన్ మధు నిదాఘ్ అబ్ బీతే,



అదితెయె ఝుంఝూవృత్త మది జన్మడోలిక
షడ్ఋతు సుమచయ ప్రసార రేఖ
సృష్టి లయములు రచించిన కౌగిలి
ప్రభుకృప జారె నపారమిటుల
ఏనాడు ధన్యమో యీనవ చేతన
తెలియ దిరులపై ప్రదీప్తి గెలుపు
ఈ గిరి నమ్మిక ఏ యుషస్సుకు నాంది
యో శృంగమగునంత యూర్ధ్వదృష్టి

ప్రణయ నాసిక నమ్మృతంపు ప్రాణమూర్తి
ఆర్తి, మాత్సర్యముల ప్రేమ నఖిలపించి
ఏ మహోన్నత జీవనాన్వేషరతిని
కన్ను దెరచెనొ యీ పసికందు జగతి

ఏబదియు నాల్గు గ్రీష్మంబులేగె, బ్రతుకు
దొన్నియల జారు నుదకబిందువుల పోల్కి.

అనువాదము : శ్రీ దుర్గానంద్

★ ★

# సందేశ్

మైం ఖోయా ఖోయాసా, ఉచాట్‌మన్, జానేకబ్
సోగయా తఖత్ పర్ లుఢక్ అర్ధ వ... మేం
దుస్స్వప్నోం కీ ఛాయా సే పీడిత, దేర్ తక్
ఉస చేతన్ కీ గహరీ నిద్రామేం సదా మగ్న

జబ్ సహసా ఆంఖ్ ఖులీ తో మేరీ ఛాతీ పర్
థా అసంతోష్ ఛారీ రీతా బోఝ జమా,
మన్ కో కచోటతీ థీ ఉధేడబున్ జన్ క్యా
అజ్ఞాత హృదయ మంథన్ సా చలతా థా భీతర్
అవసాద్ ఘుమడతా థా ఉర్ మేం కడువా ఫీకా
సబ్ అస్తవ్యస్త నిశృంఖల్ లగతా థా జీవన్
మేరా కమరా పరిచిత కమరా నహీం రహా
జీ ఊబ్ ఊబ్ ఉఠ్తా థా, మన్ బైఠా జాతా
మైం సోచ్ రహా థా జానే క్యా హోగయా ముఝే
మన్ కిన్ అన్‌జానీ దగరోం మేం హై భటక్ గయా
కితనే అంధియారే కోనే హైం మానవ మన్ కే
కుఛ్ కియే నహీం బనతా దిన యోంహీ బీత్ రహే
పానీ - సీ బహతీ ఆయు కభీ క్యా లౌటేగీ ?
ఇస్ నిరుద్దేశ్య జీవన్ నే కిస్ కో లాభ్ ఫలా !
ఖూఖాక్ బనే రహనే సే తో మరనా అచ్ఛా.

ఇతనే మేం మేరీ దృష్టి ఫర్శ్ పర్ జా అటకీ
ఇస్ పర్ జాడే కీ చిట్టీ, ఢలతీ, నరమ్ ధూప్

# సందేశము ★ ★

అలసి యొడలు నమలి నట్టులయి తునింగి
తొణకి తక్కుపై దొర్లి కందోయి వాల్చి
నాడను బడలి యుంటచే పీడ కలల
మసలె నవ చేతనా—మగ్నమైన మనసు.

కన్నువిచ్చి యొక్కమ్మడి కలయ జూతు
నేదొ ఘోర మసంతుష్టి నెత్తినట్లు
ఏదొ కళవళింపది లోన నేచినట్లు
దోచె మందర మేదియో దొరలినట్లు.

శీర్ణదేహుడ చేదు నిస్పృహా యొకండు
క్రమ్మె జీవనమ్ము తెగిన గాలి పడగ
పోలె దిరిగె నా గదియు నన్ బోలదేమి
టో యెడంద యొక్క క్షణ ముగ్రూతలూగె.

ఏమియై పోతినో మరి నేరహాస్య
తటుల నేను నను మరచి తరలినానొ
యనుచు దలచితి నీ మానవాంతరాళ
మందు గలవెన్ని యిరులకక్ష్యాంతరములు

చేయనేమియుదోచదు చిరుత దినము
లిట్టులే పోవు కాబోలు నీ కడింది
బ్రతుకు జారు గాబోలు ప్రవాహమట్లు,
ఏమి లాభము కొఱగాక యేల బ్రతికి.

అంచు దృష్టిని నేలపై వంచుకొంటి
తరళ ముకురమ్ము వలె ఎండ తళుక్కుమనియె

ఖిడకీ కీ చౌఖట్ కో కుఛ్ లంబీ తిరఛీ కర్
థీ చమక్ రహీ టూటే దర్పణ్ కే టుకడే — సీ,
పిఘలీ చాందీ కే థక్కే— సీ ఛల్‌కీ చాడీ.
జాజిమ్ పర్ థీ బన్‌గయీ తశ్తైయా మోతీ కీ
జిస్‌మేం స్వప్నోంకీ జ్వాలామేం లహరాతీ థీం;
దూధియా భావనా మేం ఉఫాన్ ఉఠ్ ఆయా హో.

మైం క్షణ్ భర్ కో మన్ కే విషాద్ కో భూల్ గయా
వహ్ ధూప్ స్నిగ్ధ చేతనా స్పర్శ సీ లగీ ముఝే,
జ్యోం రాజహంస ఉతరా హో ఖిడ్‌కీ కే పథ సే.
మేరా మన్ దువిధా ముక్త హోగయా, దుఃఖ భూల్,
ఘన కే ఘేరే సే, నికల్ చాంద్ హంస్ ఉఠతా జ్యోం.

వహ్ మౌన్ నీలిమా నిలయోం మేం బసనే వాలీ
రుపహలీ ఘనోం కీ అలకేం సహలానే వాలీ,
వహ్ సూర్యముఖీ కిరణోం కీ పరియోం సే వాహిత్
సుకుమార సరోరుహ—సే స్తనవాలీ సలజ్ ధూప్.
వహ్ రజత ప్రసారోం మేం స్వర్ణిమ అంగడాయీ భర్
ఊషా కీ స్వప్నిల పలకోం పర్ జగనే వాలీ,
వహ్ హేమ హంస పంఖోం పర్ నిత ఉడనే వాలీ
గోరీ గ్రీవా బాహోంవాలీ చంపయీ ధూప్.
వహ్ తుహిన బాష్ప కే ధూప్ ఛాంహ్ వల్కల్ పహనీ
సౌరభ మరంద తన్‌వాలీ, మలయజ వనీ ధూప్,
వహ్ ఫూలోం కే మృదు, ముఖడోం పర్ హంసనే వాలీ,
నీలే తాలోం పర్ సోనే వాలీ సుఘర్ ధూప్.
వహ్ హరీ దూబ్ కే పాంవడ్ పర్ చలనే వాలీ,

గళితమై వాలు సోరణగండ్ల నుండి
సోగగా దీర్ఘమై స్వర్ణ చూర్ణమట్లు.

గొనబు చాందిని ఉప్పున కొట్టి కరగి
పోసిన తివాసి ముత్తియముల సరస్సు
కలల మంటల తరగలు గలగలమని
పరుస్తులం దోలు క్షీరభావనల నురుగు.

మరచి పోతిని క్షణము నా మాంద్య మదియె
సరస మీరెండ చేతన స్పర్శమయ్యె
అంచ యొక్కటి వాతాయనాంచలాల
గూరివచ్చిన పోల్కి యాందోళితమ్ము
నాయెడందయు స్వచ్ఛమై నవ్వి కొనియె
ఘనముదొరగిన చంద్రమః ఖండమట్లు

అది త్రపావతి నీరెండ యది రహస్య
నీలిమల వసంతి, రజత నీరదముల
అలకలంపేర్చు పూరేక, హంస కిరణ
సూత్రికావహన సుభగ తోయజముల
బోనికోమలస్త్న శతమ్ముల నెలంత.

అది రజత శలాకల పదియారు వన్నె
జాళువామత్తు కరగి యుషస్సు కనుల
కలలపై మెల్కొనునది స్వర్ణిల మరాళ
పక్ష యుగ్మముపై దేలి పరువు లెత్తు
నాగకంఠి, సంపెగవంటి కాంతి గలది.

అది తుహిన బాష్పముల వెల్గు లందునందు
నీడలు గల వల్కలములు నెన్నడుమున
జుట్టుకొను చారు పరిమళ సుభగదేహి,
మలయజాసక్త మీరెండ, లలిత కుసుమ

రేశమీ లహరియోం బీచ్ బిఛల్ జానే వాలీ,
వహ్ ముక్తాస్మిత సీపీ కే సతరంగ్ పంఖ్ ఖోల్

శత ఇంద్రధనుష్ పహరానే వాలీ సజలధూప్,
వహ్ చాందీ కీ శఫరీ సీ ఉఛల్ అతల జల సే
చమకీలా వక్ష దిఖా అకూల్ కే పావక్ కా,
మేరే కమరే కే తుచ్ఛ పటల్ పర్, ధూల్ భరే
మఖమలీ గలీచే పర్ చుపకే సహామీ బైఠీ
మేరే కఠోర ఉర్ కో కృతజ్ఞతా కోమల్ కర్
సుఖద్రవిత కర్ గయీ, ప్రీతి మౌన సంవేదన్ దే.

మైం ఉసే దేఖ్, శ్రద్ధా సంభ్రమ సే ఉఠ్ బైఠా,
వహ్ ముఝే దేఖ్ స్నేహార్ద్ర దృష్టి, ముస్కురా ఉఠీ.
వహ్ విశ్వ ప్రకృతి కీ దూతీ బన్ కర్ ఆయీ థీ,
మైం స్మృతి విభోర్, స్వప్నస్థ హో ఉఠా కుఛ్ క్షణ కో
వహ్ మేరే హీ భీతర్ సే ముఝ్ సే యోం బోలీ :-

క్యా హువా తుమ్హేం ఓ జీవన్ శోభా కే గాయక్,
తుమ్ జ్యోతి ప్రీతి ఆశా కే స్వర్ బర్సాతే థే,
ఉల్లాస మధురిమా, శ్రీ సుషమా కే, ఛందగూంథ్
తుమ్ అమరోంకో కర్ స్వప్నమూర్త ధర్ లాతే థే.
క్యోం అబ్ తుమ్హారీ వీణా వహ్ నిస్పంద పడీ,
క్యోం అబ్ పావక్ కే తార్ న మధువర్షణ కరతే ?
కల్పనా భోర్ కే పంఛీ సీ ఉడాన్ భరతీ నభమేం ?
క్యా సోచ్ రహే హో ? ఉఠో, క్షుబ్ధమన్ శాంత్ కరో,
తుమ్ భీ క్యా జగ కీ చింతా కే కర్దమ్ మేం సన్
సందేహ దగ్ధ, ఉద్భ్రాంతచిత్త హో ఖోజ్ రహే.

వదనములపై హసించు, నిష్పావనీల
ఫాలముల శయనించు, దూర్వాదళముల
పచ్చమడువులపై బోవు, పట్టు అలల
నడుగులం బెట్టి జారెడు, నదియె ముత్తి
యాల శుక్తి సుహాస సప్తాభ్రవర్ణ
పక్షముల్ బూని శతశః ప్రభాసురేంద్ర
ధనువులన్ నిగుడించు నాతపకుమారి.

ఆ రజతశఫరి ఎగిరి అతల జలక
మందునుండి యకూలమౌ అగ్ని యొక్క
మెరపు పక్షము చూపించి మెరసి, నాదు
ప్రాంగణమ్మున నాతుచ్ఛ పటముపైన
మఖమలు పయి మౌనముగ, నమాయికముగ
క్షణము కూర్చుండి నా శిలా కఠిన హృదిని
మార్చివైచె కృతజ్ఞతా మార్దవముగ
సుఖశతముగ చైతన్య ప్రచోదకముగ
దాని జూచి తక్షణమున నే నిలిచితి
నన్ను జూచి సప్రీతిగ నవ్వెనదియు
విశ్వతత్వ దూతికయై ప్రవిష్టమయ్యె
స్వప్రహాదొరంగి స్వప్న స్థితి పెనచి నేను—

చెప్ప దొడిగె నాలోనది జేరి యిట్లు
ఓయి జీవన శోభాసమోచ్ఛగాన
సుభగ, నీవాశ ప్రేమల సురుచివర్ణ
ధారలంబిందు దుల్లాస భార మధువు
చిల్కరింతు వమరులరోచిస్సు బట్టి
స్వప్న దేహాన మొలిపింతువట్టి వాడ
వేల నేడిట్లు దురపిల్లు దేలవీణ
మ్రోయకున్నది పావక మూర్ఛనముల
నేలతేలింపదతి కల్పనాలలామ
ప్రొద్దు రెక్కల నెగిరి పోబో దదేల ?

క్యా హై జీవన్ కా ధ్యేయ, ప్రయోజన సంస్కృతి కా
సుఖదుఃఖ క్యోం హై, మానవ క్యోం హై, యా తుమ్ క్యోం హో?

తుమ్ భీ వాదోం కే వేష్టన్ మేం మన్ కో లపేట్
మానవ జీవన్ కే అమిత సత్య కా వికృత రూప్
గఢనే కో ఆతుర హో? నయా సంస్కరణ ఏక్
నిర్మిత కర్ ఉసకా ఖోఖే తర్కోం కే బల పర్?
చిర సృజన చేతనా కో, వికాస క్రమ కో అనంత్
అంజలి పుట మేం బందీ కరనే సాహస కర్,
యా భౌతిక మూల్యోం కీ వేదీ పర్ బలి దేకర్
మానవ మూల్యోం కీ, తుమ్ ధర్తీ పర్ నయా స్వర్గ
రచనే కో వ్యాకుల హో, యంత్రోం కే చక్రోం మేం
మానవ కా హృదయ కుచల్ లోహే కే టాపోం సే?
అథవా తుమ్ హింసక స్వార్థోం కే పంజే ఫైలా
నోచనా చాహతే జీవన్ కే సుందర ముఖ కో?

తుమ్ భూల్ గయే క్యా మాతృ ప్రకృతి కో, తుమ్ జిస కే
ఆంగన్ మేం ఖేలే కూదే, జిస కే ఆంచల్ మేం
సోయే జాగే, రోయే గాయే, హంసే, బడే హుయే.
జో బాల సహచరీ రహీ తుమ్హారీ, స్వప్న ప్రియా,
జో కలా ముకుర బన్ గయీ, తుమ్హారే హాథోం మేం,
తుమ్ స్వప్న ధనీ హో జిస కే, బనే అమర శిల్పీ!

జిస్ నే కోయల్ బన్ సిఖలాయా తుమ్ కో గానా,
మృదు గుంజన్ భర్ బతలాయా మధు సంచయ కరనా,
ఫూలోం కీ కోమల్ బాంహోం కే ఆలింగన భర్.

ఏమిటో దీర్ఘచింతన యెందు కిట్లు
క్షుబ్ధమయ్యెను నీ హృదయాబ్ధి నేడు
నీవునుం గూడ విశ్వ చింతావిలార్ద్ర
కర్దమంబున సందేహ కాతరుండ
వైతివేమోయి ! యుద్భ్రాంతమతిని నిట్లు
లక్ష్య మేమిటి సంసృతి రాజ్యమందు
ఎందుకీసుఖదుఃఖము లీ నరుండు
ప్రబలు నేల యనియ నీవెవండవనియు !

నీవు ప్రకృతిన్ వాద వేష్టన నిగళమందు
కసలి జీవన చిర సత్యమునకు వికృత
కోటరము గప్పి గానుబలాట పడెదో
అల్ప సంస్కరణ మొకటి యల్లి శుష్క
తర్కముల నిలబెట్టి వితర్క సేతు
చిరసృజన చేతనను, వికాసరము, ననంత
సంపుటిని ద్రావనెందుకు సాహసింతు ?
కాక భౌతిక వేది నఖండ మనుజు
మూల్యములు బలివెట్టి యమూల్యములను
దివి యొనర్పంగ యంత్ర సందీప్త చక్ర
ముల గరగరగ త్రిప్పి నమూల్య హృదిని.
కాక హింస్రక స్వార్థ జిహ్వాకబళన
లంపటుండవో బ్రతుకు హోరంగు గోరుజ
మరచినాడవు నీవు నీ మాతృసృష్టి
విభవ రాజ్యాన నెద్దాని వెడద యొడిని
ఆడినాడవో పాటలుపాడి మనసు
పెంచినాడవో నీవును పెరిగినావో

ఆ ప్రకృతి నీకు నెచ్చెలి ఆదినుండి
స్వప్నసఖి కళా దర్పణ సద్మశమయ్యె

జిన్ కే రంగోం కీ భావుక తూలీ సే తుమ్‌నే
శోభా కే పదతల రంగే, మనుజ కా ముఖ ఆంకా,
జిన్ సే లేకర్ మధుస్పర్శ శబ్ద రస గంధ దృష్టి
తుమ్‌నే స్వర నిర్ఝర బరసాయే సుఖ సే ముఖరిత.

అబ్ జన నగరోం కీ అంధీ గలియోం మేం ఖోయే,
ఊంచే భవనోం కీ కారావోం మేం బందీ హో,
తుమ్ అపనీ హీ చింతా మేం ఘులతే జాతే హో ?
క్యా లోక మాన మర్యాదా కీ పా స్థూల దృష్టి
నిజ సూక్ష్మ స్వప్న దర్శీ దృగ తుమ్‌నే మూంద్ లియే ?

లో : మైం ఆసీమ కా లాయీ హూం సందేశ తుమ్హే !
ఆవో, ఫిర్ ఖులీ ప్రకృతి కీ గోదీ మేం బైఠో,
ఫిర్ దిక్ ప్రసన్న జీవన కే ఆంగన్ మేం ఖేలో,
ఉద్దేశ్య హీన భీ రహనా జహాం మధుర్ లగతా.
ఫిర్ స్వప్న చరణ ధర్ విచరో శాశ్వత కే పథ మేం,
కల్పనా సేతు బాంధో భావీ కే క్షితిజోం మేం
మన్ కో విరాట్ కీ ఆత్మా సే కర్ సర్వయుక్త
తుమ్ ప్యార్ కరో, సుందరతా సే రహనా సీఖో,
జో అపనే హీ మేం పూర్ణ స్వయం హై, లక్ష్యస్వయం.
కవి, యహీ మహత్తర ధ్యేయ మనుజ కే జీవన కా.
మైం మన్ కీ కుంఠిత కూపవృత్తి సే బాహర్ హో

చింతావోం కే దుర్భేధ భంవర్ సే నికల్ శీఘ్ర
పావన్ ప్రకాశ కే నిరవధికణ మేం డూబ్ గయా,
సునహలీ ధూప్ కే కరతల కే శాశ్వత మేం లయ
మన్ సే ఊపర్ ఉఠ్, తన్ కీ సీమావోం సే కఢ్,

మైత్రి వొక స్వప్నరాశి వనాది శిల్పి
వదియె కోకిలంబయి గీతికాళి నేర్పె
మధుర ఝుంకృతి పలికించి మధువుసంగ్ర
హింపనేర్పె పువ్వుల కౌగిలింత లోన,
దాని బహువర్ణ భావుకతా విలాస
తూలికంద్రిప్పి రంగుల దొడిగి జిలుగు
కుంజిలుగు హత్తినావు సుకోమలా కృ
తులు వెలార్చ నీకు నదియె తోడు పడియె
తన్మధు స్పర్శనే గదా తనిసి స్పర్శ ;
రాగరసగంధ దృక్ప్రసారాదికముగ
గురిసినాడవు, గాన నిర్ఝరులు దిశల
ఇపుడు నగర వీథుల దివాంధీకృతాట్ట
ముల విశాల సౌధ నిగళ మోహ వశత
మరచినాడవు నీవు నీ మమత లోన
ఐహికంబుల యంతర్వ్యాలైన విలువ
లున్న స్థూలతన్ బొంది సమున్నతాంత
రంగ బహుసూక్ష్మదృష్టిని రమ్య గతిని.

ఇదిగో తెచ్చితి నీ కొరకీశునాజ్ఞ
రమ్ము తిరిగి నీ ప్రకృతిలలాము మొడికి
దిక్ప్రసన్నతా జీవన తీర్థతటుల
ఆడు మెచ్చోట నిష్ఫలమైన యాట
కూడ నున్మత్త సుఖముల గూర్చు సఖుడ !
స్వప్న సంభృత పదములు సంచలింప
నేగుమా శాశ్వత పథాల నెగసి కల్ప
నల వినిర్మింపు భావిననారతముగ
మానసముననంతమున సల్లీన పరచి
కోమలముగ జీవింపగా కోర్కె వడుము
ఏది తన లోన పూర్ణమో యేది తనకు
తానుగా లక్ష్యమై భాసమాన మయ్యె

ఫిర్ స్వస్థ సమగ్ర, ప్రఫుల్ల పూర్ణ బన్, మోహ ముక్త్,
మైం విశ్వ ప్రకృతి కీ మహదాత్మా మేం సమాగయా.

ముఝ్‌కో ప్రసన్న మన్ దేఖ్, ధూప్ సకుచా-కుమ్హలా
బోలీ, అబ్ బిదా, ముఝే జానా హై వహ్ దేఖో,
కిరణేం అస్తాచల పర్ కంచన పాలకీ లియే
ముఝ్ కో ఠహరీ హై, క్షితిజ రేఖ కా సేతు బాంధ్.

యుగ సంధ్యా యహ్, అస్తమిత ఏక్ ఇతిహాస వృత్త
ఢల్‌నే కో బ్రహ్మ అహన్, బుఝ్‌నే కో కల్పసూర్య,
ముంద్‌నే కో మానస పద్మ ఉదితజ్యోతిర్మయ కవి ;
ఘూమతా వివర్తన చక్ర, ఆజ్ సంక్రాంతి కాల్
యది అంధకార్ కా ఘోర్ ప్రహార్ టూటే తుమ్ పర్,
తో ముఝే స్మరణ రఖనా, యహ్ జ్యోతి ధరోహర్ లో,
జబ్ హోగీ మానసగ్లాని, ఘిరేగీ మోహ నిశా
మైం నవప్రకాశ సందేశవాహ్ బన్ ఆవుంగీ,
సంధ్యా పలనోంమేం ఝులా సుసహాలే యుగప్రభాత్.
యహీ కహ్, వహ్ అంతర్ధాన్ హోగయీ పల్ భర్ మేం,
సిమటా అపనే ఆభాకే అంగోం కో ఉర్ మేం.

---

నదియె నరున కుత్తమగంతవ్యమయి వెలుగు
ననగ కుంఠిత రూప మాంద్యమ్ము వీడి
చింతలంద్రోసి పెనుమాయ చిక్కు వీడి
నిఖిల దీప్తి ప్రభాబ్ధి మునింగి పోతి.

వెండి నీరెండ యొడిని పరుండి యుండి
మనసు వల జీల్చి తనువు సీమలను దాటి
స్వస్థతంగూడి యున్మేష సాంద్రుడనయి
నిస్తులానంద సృష్టి మునింగిపోతి
మోద సంప్లుత హృద్వ్యాప్తుగా దలంచి
ఎండనన్ జూచియనె సెలవిమ్ము నాకు
పశ్చిమార్చులు బంగరు పాలకీని
గొని ప్రతీక్షించు చుండె నాకొరకు, బోదు.

ఇదియె యుగసంధ్య అస్తంగతేతిహాస
మణగిపోవ, బ్రహ్మోహాస్సు నాగిపోవ,
కల్పసూర్యుండు హృదయపుంగనులమూత
పడుట కేమొయో యుదయప్రభావృత కవి !

తిరుగుచుండు వివర్తన మరిగె నేడు
సంధికాలమ్ము. నెపుడేని చపల తమము
జేరెనా నిను-ఇదిగొ విస్మృతిని గనకు
జ్యోతినొకటిన్యాసముగ నేనుంచు చుంటి
నీదు హృదయము క్షుబ్ధమై నీరసించు
నపుడ నేనరుదెంతు సమాశ్వసించి
పోవ, సంజెడోలల నిద్రబుచ్చి రవిని
అనుచు నది కను రెప్పలో నరిగె తనదు
వెలుగులన్ దన మేన ద్రవించు కొనుచు.

అనువాదము: శ్రీ దుర్గానంద్.

★ ★ హిమాద్రి

మానదండ భూకే అఖండ హే,
పుణ్యధరా కే స్వర్గారోహణ్,
ప్రియ హిమద్రి, తుమ్‌కో హిమకణ సే
ఘేరే మేరే జీవన కే క్షణ్
ముఝ్ అంచలవాసీ కో తుమ్‌నే
శైశవ మేం ఆశా దీ పావన్,
నభ మేం నయనోం కో ఖో, తబ్ సే
స్వప్నోం కా అభిలాషీ జీవన్.

కబ్ సే శబ్దోం కే శిఖరోం మేం
తుమ్హేం చాహతా కరనా చిత్రిత్
శుభ్ర శాంతి మేం సమాధిస్థ హే
శాశ్వత సుందరతా కే భూభృత్,
బాహ్యచేతనా మేరా తుమ్ మేం
జటీభూత ఆనంద తరంగిత్
తుమ్హేం దేఖ్ సౌందర్య సాధనా
మహాశ్చర్య సే మేరీ విస్మిత్ !

జిన్ శిఖరోం కో స్వర్ణకిరణ నిత్
జ్యోతి ముకుట సే కరతీ మండిత్
జిన్ పర్ సహసా స్ఖలిత తడిత్
హో ఉఠ్‌తీ నిజ ఆలోక సే చకిత్
జిన్ శిఖరోంపర్ రజత పూర్ణిమా
సింధు జ్వార సీ లగ్‌తీ స్తంభిత్
జిన్ కీ నీరవతా మేం మేరే
గీత స్వప్న రహతే థే ఝంకృత్

జిన్ కీ శీతల జ్వాలా మేం జల్
బనీ చేతనా మేరీ నిర్మల్.

# హిమాద్రి ★ ★

భూమాపకమా! ఈ యఖండగిరి!
పుణ్యభూమి స్వర్గారోహణమా!
నిన్నలమిన హిమబిందువులం బలె
నన్నలమినవీ జీవన లిప్తలు
నీ ప్రాంగణవాసిని నన్ను హిమా
నీ ఘన! చేసితివాశాశిశువుగ
నింగిని సారించిన కనురెప్పల
నే నిప్పటికిని స్వప్నాకాంక్షిని

అప్పటినుండియు నతుర పూజల
నభిషేకించగ నువ్విళ్లూరితి
నాశైశవ చైతన్యము నీలో
నాట్యమూడె జడమై వీచికయై
నిన్ను జూచి నా సౌందర్య నిష్ఠ
నిబిడాశ్చర్యమునం దోగాడెను.
నీ శిఖరమ్ముల స్వర్ణపాదములు
నిచ్చలు జ్యోతిర్మకుటము గట్టును

నీపై నుగ్గిన విద్యుల్లేఖలు
నిల్వన తామే నింతై పోవును
నిండు పున్నములు నీ కొమ్ములపై
నీరధి నురుగై కన్పడు జడమై
ఆ నిస్తబ్ధతలో నా మృదు గీ
తాలాపములున్ కిపకిపగూయును
నాచేతన నిర్మల మయ్యెను పూ
ర్ణాహుతిగా నీచల్లని జ్వాలల
నీ స్వర్గోన్నత సౌందర్య జలధి
నిలిచియె నా ప్రాణమ్ములు వెలిగెను

ప్రాణ్ హులయే ఆలోకిత జిన్ కే
స్వర్గోన్నత సౌందర్య సే సజల్.
హృదయ్ చాహతా కావ్య కల్పనా కో
కిరీట పహనానా ఉజ్వల్
స్మృతిమేం జ్యోతి తరింగిత స్వరిక్
శృంగోంకే ఆలోక కా తరల్.

వసుధా కీ మహాకాంక్షా-సే
స్వర్గ క్షితిజ సే భీ ఉఠ్ ఊపర్
అంతర ఆలోకిత్ సే స్థిత తుమ్
అమరోం కా ఉల్లాస పాన్ కర్!
ఉరోభార సే గౌర, ధరణి కే,
సోయా స్వర్గ శిశధర్ జిస్‌పర్,
తుమ్ భారత్ కే శాశ్వత గౌరవ్
ప్రహరీ-సే జాగరిత నిరంతర్.

రవి కీ కిరణేం జిసే స్పర్శకర్
హో ఉఠతీ ఆలోక వినాదిత్
జిస్ పర్ ఉషా సంధ్యా కీ ఛవి
ఆది సృష్టి - సే హీ స్వర్ణాంకిత్
ఇందు జ్వలిత తుమ్ స్ఫటిక ధవళిమా
కే క్షీరోదధి - సే హిల్లోలిత్
జ్యోత్స్నా మేం థే స్వప్న మౌన్
అప్సరా లోక — సే లగతే మోహిత్

సురంగ్ ప్రవాలోం కీ రత్నశ్రీ
అహరహ రహతీ జహాం మర్మరిత్
దేవదారు కీ చారు సూచి సే
మరకత తలహటియాం రోమాంచిత్
మౌన స్వర్గ ముఖ పర్ అంకిత తుమ్
శుచి దిగంత స్మృతి - సే చిరశోభిత్

మనసు జేయునారాటము కల్పన
కనువగు ముకుటము తొడ్గుదునాయని
స్మృతిలో జ్యోతి తరంగితమై సుర
శృంగాలోకితమయ్యేనాయని
పృథ్వీమహదాకాంక్షల వలె నా
పృథుల స్వర్గము మరింత యెత్తుగ
అంతఃప్రకాశ సంస్థిత శైలమ!
అమరోల్లాసపు మధువానితివా!

ధారణి వక్షోభారమువలె సుర
ధారణి యొూదలవంచి పరుండెను
భారత శాశ్వత గౌరవమా! అతి
పావనత్రాతవు నీ వొక్కడవే
రవికాంతులు సంస్పర్శించియె నిను
రవళింప దొడుగు వెలుగొంద జూచు
సంధ్యోషస్సుల నిరంతరచ్ఛవి
స్వర్ణాంకితమయ్యెగదా నీలో

ఇందుజ్వాలాదగ్ధము స్ఫటికము
చిందిన పాలకడలియైనదియన
జ్యోత్స్నాస్వప్నస్థగితుడ వీవు
ద్యోతితసురకన్యానగరమ్మువో!
పలురకాల వైడూర్య మణులతో
చెలువొందుచునుందువునిత్యమ్మును
దేవదారు తరువుల పూరెమ్మల
దివ్యమ్మరకత తటములు మెరయును

నీరవ సురనగరీముఖమున నయ
గారము నీ యది మందస్మితి వలె
ఆదితత్వ సన్నిభమౌ నిజశో
భాలోకన జేతువు కన్నార్పక

ఆది తత్వ – సే, అపనీ హీ శోభా
విలోక రహతే అనిమేషిత్.

నీలీ ఛాయాయేఁ థీ తన్ పర్
లగ్తీ ఆభా కీ - సీ సిహరన్,
ఇంద్ర ధనుష మండల సే దీపిత్
ఉడతే థే శత హంసముఖ హిమకణ్
స్వర్ దూతోం కే పంఖోం సే స్మిత్
తడిత చకిత హిమ కే రోమిలఘన్
రంగోం సే వేష్టిత రఖతే థే
తుమ్ కో హే ఆలోక నిరంజన్

ప్రతి వత్సర ఆతీ థీ మధు ఋతు
సద్యః స్ఫుట దేహీ లే కుసుమిత్
చిర్ రశ్మియోంకో, ఫూలోం కే
అంగోం పర్ నిజకర శత రంజిత్.
ఖులీ పంఖడియోం కీ కంచుక్
సౌరభ శ్వాసోం సే థీ స్పందిత్
మేరే శైశవ కో నిత ఉసకీ
గీత కోకిలా రఖతీ కూజిత్

కలరవ: స్వప్నాతప, సురధను పట్
శశిముఖ, హిమస్మిత, గాత్ర లే శ్వసిత్
షడృతు కరతీ థీ పరిక్రమా
అప్సరియోం సీ సురపతి ప్రేషిత్.
శరద్ చంద్రికా హో జాతీ థీ
స్వప్నోం కే శృంగోం పర్ విజడిత్
హిమ కీ పరియోంకా అంచల్ ఉడ్
భూ కో కర్ లేతా థా పరివృత్

రంగ్ రంగ్ కే చిత్రిత పక్షీ
ఉడతే నభమే గీత తరంగిత్.

నల్లని నీడలు నీ దేహముపై
చల్లని కాంతులు ముడిచిన పోలిక
ఇంద్రధనస్సులనుం చెగ ప్రాకుచు
హిమ బిందువులొకపరి బడి నవ్వుచు

స్వర్ణాతిక రెక్కలవలెనిఖిలా
శాంతము మెరయుచు మంచుల మబ్బులు
రంగులతో వలగొని నిను గొల్చును
రజతాలోక నిరంజన రూపా !
ప్రతివర్షము మధుబుతువరుదెంచును
ప్రతికుంజము సద్యఃస్మితమ్మగు
రవికాంతులతో సుమమంజరులన్
రవళింపించెడు నీహస్తమ్ములు.

వికసించెదు రేకుల ముసుగుల పై
విధ్యపు సౌరభ్యము నిక్షిప్తాత్ముడు
నాశైశవపుంగతి నెప్పుడు గా
నామృత కోకిలమే మ్రోగించెడు
కలరవముల, స్వప్నాతపముల, రా
కాశశికాంతుల, హిమతనువులతో
షడృతువులు పరిక్రమించు చుండును
స్వర్గేశుడు పనిచిన అచ్చరలై

శారద చంద్రిక స్వప్న శిఖర కే
దారము పై స్తంభించును నిత్యము
హిమసుర కన్యల చేలాంచలమ
డ్డముగా పడి చుట్టును భూ పరిధిని
చిత్రవిచిత్ర విహంగ పంక్తులు ర
చించును గానామృత వాహినులను
నీలపీత షట్పది ఝంకారము
నిస్తబ్ధత పై సమరము చాటును

పీలపీత భృంగోం కా గుంజన్
మౌనక్షణోం కో రఖతా ముఖరిత్
ఊష్మా కా సూర్యాతప తుమ్ మేం
లగతా శీతలతా – సా మూర్తిత్
ఇంద్రచాప పుల్ పర్ వర్షా మేం
సురబాలాయేం ఆజాతీం నిత్

జగ ప్రచ్ఛాయ గుహావోం మేం నవ్
ఖాష్పోం కే గజ భరతే గర్జన్
చంచల్ విద్యుత్ లేఖాయేం థీ,
లిపట్ దృగోం సే జాతీ తత్క్షణ్
తారావోం కే సాథ్ సహజ్
శైశవ స్వప్నోం సే భర్ జాతా మన్.
ఉఠతే థే తుమ్ అంతర్ మేం
సౌందర్య స్వప్న శృంగోం పర్ మోహన్.

మేఘోం కే ఛాయా కే, సంగ సంగ్
హరిత ఘాటియాం చలతీం ప్రతిక్షణ్
వన కే భీతర్ ఉడతా చంచల్
చిత్ర తితలియోం కా కుసుమిత వన్
రంగ్ రంగ్ కే ఉపలోం పర్ రణ మణ్
ఉఛల్ ఉత్స కరతే కలగాయన్
ఝరనోం కే స్వర జమ్ – సే జాతే
రంజిత హిమానీ సూత్రోం మేం ఘన్

భీమ విశాల శిలావోం కా వహ్
మౌన హృదయ మేం ఆబ్ తక్ అంకిత్
ఫేనోం కే జల స్తంభోం – సే వే
విర్ఘ్ఫుర రభస వేగ సే ముఖరిత్
చీడోం కే తరువన కా తమ్
సాంవే తరణా మనమేం అందోలిత్

గ్రీష్మాతపదుర్ధర కోపము నీ
క్రేగంటుల బడి చల్లదనమ్మగు
ఇంద్రధనుసు వంతెనపై గునగున
ఇంద్రేందు ముఖులు వత్తురు వానల
విశ్వవిజన విచ్ఛాయాగుహాల స
పీనాశ్రుమదేఘము గర్జించును
చంచల విద్యుల్లేఖాపళిత
క్షణమంటును వాల్ గన్నుల రెప్పల

తారలతో పాటుగ నిసర్గ శిశు
తాస్వప్నమ్ములతో హృది నిండును
సాలవృక్షములు భిన్న మనమ్ముల
చీకటియూర్పుల విడుచుచున్నయవి
స్రోతస్సుల గంభీరచ్ఛాయలు
జ్యోతిరింగణముల గుంఫితమ్ములు
క్షిప్రస్రోతస్సులు నాలపించు
తుషార నిర్మలములు సరస్వతులు

సురభిళాలకలు తాకి సమీరము
మన హృదయమ్ముల కొసగును హాయిని
నీలపీత హరితారుణ విద్యు
న్మోహన గగనము మేల్కొనుచున్నది.
రజతహిమానీ ధూమ గర్భమున
అరణ్య భాగమ్ము దృశ్య మైనది
వెలిగి వెలిగి అచ్చట ఓషధి సుఖ
స్వప్నాసౌధముల నుద్దీపించును

స్తనహారపు ముక్తాఫలములు హాసి
యించుచు మంచు వనమ్ముల కలియును
అచటి అచ్చరలు మదన భస్మ శిఖ
వేగని తనువులను పులకలందెదరు

దరియోం కీ గహరీ ఛాయామేం
జ్యోతి రింగణోం సే థీ గుంఫిత్

గాతే ఉర్ మేం క్షిప్ర స్రోత్
లహరాతే సర్ తుషార కే నిర్మల్
సౌరభ కీ గుంజిత అలకోం సే
ఝూ సమీర ఉర్ కరతా శీతల్
నీలీ పీలీ హరీ లాల్
చపలావోం కా నభ జగతా చంచల్
రజత కుహా సే మేం క్షణ్ మేం
మాయా ప్రాంతర హో జాతా ఓఝల్.

సంభవ, పురా తుమ్హారీ ద్రోణీ
కిన్నర మిథునోం సే హో కూజిత్
ఛాయా విస్మృత గుహాయేం ఉన్మద్
రతి సౌరభ సే సతత ఉచ్ఛ్వసిత్
ఓషధియాం జం జల దరియోం కే
స్వస్ప్రకక్ష కరతీ హోం దీపిత్
ఓసోం కే వన మేం మిలతే హోం
స్తన హారోం కే ముక్తా ఫలస్మిత్.

మదన దహన కే భస్మ అనిల మేం
ఉస్ అబ్ తక్ తన్ కరతీ పులకిత్
సతీ అపర్ణా కే తపసే
వనశ్రీ అవాక్ - సే లగతీ విస్మిత్
అబ్ భీ ఉషా వహాం దీఖతీ
వధూ ఉమా కే ముఖ — సే లజ్జిత్
లగతీ చంద్రకలా భీ గిరిజా — సీ
హీ గిరి కే క్రోడ్ సే ఉదిత్

అబ్ భీ వహీ వసంత విచరతా
పుష్పశరోం సే భర్ దిగంత స్మిత్

అచటి వనాంగన అపర్ణతపమున
నిరుత్తరత్వము నందియున్నయది
ఉషస్సు నేటికి నుమాముఖము వలె
చిరుసిగ్గున అలరారు చుండినది

వర్ధమాన శశికళ ఈనాటికి
ఉమవలె గిర్యంకమ్మున వెలయును
సుమ శరములతో దిక్కుల నింపుచు
వసంత మిప్పటికిని చరియించును
గంధోద్ధత పాషాణ పాళికలు
పులకాంకురముల ప్రకాశించినవి.
శుకపికములు గిరిబాల్యమ్మును
గానమొనర్చును శ్రావ్యగీతికల

దేవదారు శిఖరాగ్రమ్ములు శివు
నట్లు నేటికిని సమాధిస్థములు
వప్రక్రీడా గజజలవాహము
నేటికి కూర్మాచలమున ప్రాలును
కవి సందేశము నందించును జల
దము వాతాయనమున ధ్వనియించుచు
నేటికి గూడను ముగ్ధ నయనముల
గ్రామయువతి జలదుని దరిసించును

పసిపాపలు మేఘమ్మును చూడగ
అభినందన కలకలము లొనర్తురు.
జీవన జలనిధి తటమున నిలబడి
అహంకారలహరీ సమూహముల
సంఘర్షణమును చూచుచునుంటిని
బుద్బుదను పేక్షితుడ అవాంఛితుడ
ఎవ్వరి ఔన్నత్యమ్మున నా అంత
భాగము జనించెనో తలపోసెద

గంగోద్గామ ధరా వహ హీ పాషాణ్
శిలాయే పులకిత పల్లవిత్
అబ్ భీ ప్రియ గౌరీ కా శైశవ్
వర్ణన కరతే ఖగపిక ముఖరిత్.
దేవదారు కే ఊర్ధ్వ శిఖర్
వైసే హీ శంకర - సే సమాధి సిత్

అభీ ఉతరతా కూర్మ సాను పర్
పత్ర క్రీడా పరిణత గజఘన్
వాతాయన సే మంద స్తనిత కర్
దేతా కవి సందేశ అర్ధ్యిస్వన్
అబ్ భీ అంకే ఉరా దేఖతీ
గ్రామవధూ ఉనకో సరళ నయన్
శుభ్ర వలాకోం కే దళ్ నభ మేం
కలధ్వని భర్ కరతే అభివాదన్.

ఆజ్ జీవనోదధి కే తట పర్ ఖడా అవాంఛిత, క్షుబ్ధ, ఉపేక్షిత్
దేఖ్ రహా హై మైం క్షుద్ర అహం కీ శిఖర లహరియోంకా రణ కుత్సిత్.
సోచ్ రహా, కిస్ కే గౌరవ సే, మేరా యహ అంతర జగ నిర్మిత్,
లగతా తబ్, హే ప్రియ హిమాద్రి, తుమ్ మేరే శిక్షక్ రహే అపరిచిత్.

జోర్, పూఛతా మైం మన్ సే, క్యా యహ ధరతీ రహ సకతీ జీవిత్
జో తుమ్ స్వర్గిక గరిమా భూపర్ బరసాతే రహతే న అపరిమిత్
శిఖర శిఖర ఊపర్ ఉన్ తుమ్‌నే మానవ ఆత్మా కర్ దీ జ్యోతిత్
హై అసీమ ఆత్మానుభూతి మేం లీన, జ్యోతి శృంగోం కే భూ భృత్

ఘనీభూత అధ్యాత్మ తత్వ - సే జిస్ సే జ్యోతి సరిత శత నిఃసృత్
ప్రాణోం కీ హరియాలీ సే స్మిత పృథ్వీ తుమ్ సే మహిమా మండిత్
స్ఫటిక సౌధ - సే శ్రీశోభా కే రశ్మి రేఖ శృంగోం సే కల్పిత్
స్వర్గ ఖండ తుమ్ ఇస్ వసుధా పర్, పుణ్య తీర్థ హై, దేవ ప్రతిష్ఠిత్



ఓ హిమశైలమ! నీవే నా
కు పరోక్షాచార్యుడవని భావించెద
స్వర్గగరిమ భూలోకము నందున
నీవే వర్షించనిచో ఈ ధర
ఇట్లు సజీవముగా నలరారునె
ఈఘన శిఖరోపరి శిఖరమ్ముల
పెరిగి మానవాత్మను తేజో
మయ మొనరించెదవని భావించెద

అపరిమితాత్మానుభూతి లోపల
లీనమైన ఓ జ్యోతిశ్శృంగమ!
ఘనీభవించిన అధ్యాత్ముడవై
జ్యోతిస్స్రోతస్సుల ప్రసరింపుము
ప్రాణహారితిమతో హసియించెడు
ధరమహిమాన్విత మగు నీతో
శ్రీశోభారశ్మి శృంగయుతుడవు
విశ్వంభర పై స్వర్గ ఖండమవు

దేవతావళీసంప్రతిష్ఠిత
ప్రశాంత పుణ్యక్షేత్రమ వీవు.

అనువాదము: శ్రీ దురానంద్

★ ★ 

# పరివర్తన్

కహాం ఆజ్ వహ్ పూర్ణ పురాతన, వహ్ సువర్ణ కా కాల్?
భూతియోం కా దిగంత ఛవి జాల్, జ్యోతి చుంబిత జగతీకా భాల్?
రాశిరాశి వికసిత వసుధా కా వహ్. యౌవన విస్తార్ ?
స్వర్గ కీ సుఖమా జబ్ సాభార్ ధరా పర్ కర్ తీ థీ అభిసార్.

ప్రసూనోం కే శాశ్వత శృంగార్, (స్వర్ణ భృంగోం కే గంధ విహార్)
గూంజ్ ఉఠ్ తే థే బారంబార్, సృష్టి కే ప్రథమోద్గార్,
నగ్న సుందరతా థీ సుకుమార్, బుద్ధి ఔ, సిద్ధి అపార్
ఆజ్ తో సౌరభ కా మధుమాస్ శిశిర మేం భరతా సూనీసాంస్.

వహీ మధుఋతు కీ గుంజిత డాల్ ఝుకీ థీ జో యౌవన కే భార్,
అకించనతా మేం నిజ తత్కాల్ సిహర ఉఠతీ, జీవన హై భార్.
ఆజ్ పావస్ నద కే ఉద్గార్ కాల కే బనతే చిహ్నకరాల్;
ప్రాత్ కా సోనే కా సంసార్ జలా దేతీ సంధ్యా కీ జ్వాల్.

ఆజ్ బచపన్ కా కోమల గాత్ జరా కా పీలా పాత్.
చార్ దిన్ సుఖద చాందనీ రాత్, ఔర్ ఫిర్ అంధకార్. అజ్ఞాత్
శిశిర సా ఝర్ నయనోం కా నీర్ ఝులస్ దేతా గాలోంకే ఫూల్.
ప్రణయ కా చుంబన్ ఛోడ్ అధీర్ అధర్ జాతే అధరోం కో భూల్.

మృదుల హోంఠోం కా హిమజల హాస్ ఉడా జాతా నిఃశ్వాస సమీర్,
సరళ భౌంహోం కా శరదాకాశ్ ఘేర్ లేతే ఘన, ఘిర్ గంభీర్.
శూన్య సాంసోం కా విధుర వియోగ్ ఛుడాతా అధర మధుర సంయోగ్;
మిలన్ కే పల్ కేవల్ దో, చార్, విరహ కే కల్ప అపార్

# పరివర్తన



పూర్ణపురాతన సువర్ణకాలము
మనోజ్ఞమంజుల సుషమాజాలము
జ్యోతిశ్చుంబిత జగతీ పాలము
ఈనాడిచ్చట చూడగజాలము

స్వర్గసుషమ తన సమస్త సంపద
తో ధర పై నడయాడిన రోజులు
ప్రసూన శాశ్వత శృంగారమ్ములు
స్వర్ణ భృంగసురభిళ విహారములు

బుద్ధులు, సిద్ధులు, అపార బుద్ధులు
నేటి వసంత మనోహర శోభలు.

ఓ నిష్ఠుర పరివర్తనమా !
నీ భీషణ నర్తన మే యిది

ఓ సహస్ర ఫణవాసుకి ! నీవే
ఈ ఘోరమ్మున కెల్ల కారణము
విక్షత జగతీ వక్షః స్థలమున
నీ చరణమ్ముల చిహ్నము లవిగో !

అహే నిష్ఠుర పరివర్తన్ ! తుమ్హారా హీ తాండవ నర్తన్
విశ్వ కా కరుణ వివర్తన్, తుమ్హారా హీ నయనోన్మీలన్,
నిఖిల ఉత్థాన, పతన్ అహే వాసుకి సహస్ర ఫన్

లక్ష అలక్షిత చరణ తుమ్హారే చిహ్న నిరంతర్
ఛోడ్ రహే హైం జగ కే విక్షత వక్షస్థల పర్.
శత శత ఫేనోచ్ఛ్వాస్, స్ఫీత ఫూత్కార భయంకర్
ఘుమా రహే హైం ఘనాకార జగతీ కా అంబర్.
మృత్యు తుమ్హారా గరళ దంత, కంచుక్ కల్పాంతర్,
అఖిల విశ్వ హీ వివర్

వక్ర కుండల్, దిక్ మండల్
హాయ రీ దుర్బల భ్రాంతి ! కహాం నశ్వర్ జగతీ మేం శాంతి !
సృష్టి హీ కా తాత్పర్య అశాంతి, జగత్ అవిరత జీవన సంగ్రామ్
స్వప్న హై యహాం విరామ్

ఏక్ సౌ వర్ష్, ఉపవన్ నగర్. ఏక్ సౌ వర్ష్, విజన వన్,
యహీ తో హై అసార సంసార్, సృజన్, సించన్, సంహార్
ఆజ్ గర్వోన్నత హర్మ్య అపార్, రత్న దీపావళి, మంత్రోచ్చార్ :
ఉలూ కోంకే కలభగ్న విహార్, ఝిల్లియోం కీ ఝనకార్

దివస నిశా కా యహ్ విశ్వవిశాల్, మేఘ మారుత్ కా మాయాజాల్
అరే, దేఖో ఇస్ పార్, దివస కీ ఆభా మేం సాకార్
దిగంబర, సహమ రహా సంసార్, హాయ్ ! జగ కే కర్తార్ !

ప్రాత హీ తో కహలాయీ మాత్, పయోధర్ బనే ఉరోజ ఉదార్
మధుర ఉర్ ఇచ్ఛా కో అజ్ఞాత ప్రథమ హీ మిలా మృదుల ఆకార్ :
ఛిన్ గయా హాయ్ ! గోద్ కా బాల్,
గడీ హై బినా బాల్ కీ నాల్.

ఘనాకార జగదంబరమును నీ
ఘూత్కారానిలమే నడిపించును
మృత్యువె నీ గరళాయిత దంతము
దిఙ్మండలమే వక్ర కుండలము

నూరేడుల కీనాటి పురోద్యానము
విజన వనమ్మై కనుపించును
ఇదే నేటి లోకపు తీరైనదె
సృష్టియు స్థితియు లయమ్ములు తప్పవో

నేటి స్వర్గ సౌధాంతరమున ఒక
నాటికి ఘూకము కేకలు వేయును
రాత్రిందివముల ఈ విశ్వంభర
గాలి మేడయై కనుపించినది

ప్రాతస్సే మాతృత్వము బూనెను
ఉరోజమ్ములే పయస్సు నొసగెను
హృదయము లోపలి కోరిక చిన్నది
పసిపాపని రూపము ధరియించెను

ఇంతలోనె పసి పాపను లాగుక
పోలీవా అవని ఒడినుండి యిటుల్

అభీ తో ముకుట బంధా థా మాథ్, హుయే కల్ హీ హల్దీ కే హాథ్
ఖులే భీ న థే లాజ్ కే బోల్, ఖిలే భీ చుంబన్ శూన్య కపోల్:
హాయ్ ! రుక్ గయా యహీ సంసార్ బనా సిందూర్ అంగార్;
వాత హత లతికా వహ్ సుకుమార్ పడీ హై ఛిన్నాధార్ !
ఆహ్ భీషణ ఉద్గార్ ! నిత్య కా యహ్ అనిత్య నర్తన్,
వివర్తన జగ, జగ వ్యావర్తన్, అచిర మేఁ చిర కా అన్వేషణ్
విశ్వ కా తత్వ పూర్ణ దర్శన్. అతల సే ఏక్ అకూల ఉమంగ్,
సృష్టి కీ ఉఠతీ తరళ తరంగ్, ఉమడ్ శతశత బుద్బుద సంసార్
బూడ్ జాతే నిస్సార్ బనా సైకత కే తట అతివాత్
గిరా దేతీ అజ్ఞాత్ కామనావోం కే వివిధ ప్రహార్
ఛేడ్ జగతీ కే సర్ కే తార్, జగాతే జీవన కే ఝంకార్,
స్ఫూర్తి కరతే సంచార్, చూమ్ సుఖ దుఃఖ కే పులిన అపార్
ఛలకతీ జ్ఞానామృత కీ ధార్
పిఘల్ హోంఠోం కా హిలతా-హాస్, దృగోం కో దేతా జీవన దాన్,
వేదనా హీ మేఁ తపకర్ ప్రాణ్, దమక్, దిఖలాతే స్వర్ణ హులాస్
తరసతే హైం హమ్ ఆఠోం యామ్, ఇసీ సే సుఖ అతిసరస, ప్రకామ్;
ఝేలతే నిశిదిన కా సంగ్రామ్
ఇసీ సే జయ అభిరామ్; అలభ హై ఇష్ట, అతః అనమోల్,
సాధనా హీ జీవన్ కా మోల్.
విశ్వమయ హై పరివర్తన్, అతల సే ఉమడ్ అకూల, అపార్,
మేఘ సే విపులాకార్; దిశావధి మేఁ పల్ వివిధ ప్రకార్
అతల మేఁ మిలతే తుమ్ అవికార్.
అహే అనిర్వచనీయ! రూప్ ధర్ భవ్య, భయంకర్,
ఇంద్రజాల - సా తుమ్ అనంత మేఁ రచతే సుందర్;
గరజ్ గరజ్, హఁస్ హఁస్ చఢ్ గిర్; ఛా, ఢా, భూ - అంబర్
కరతే జగతీ కో అజస్ర జీవన సే ఉర్వర్;

కాళ్లకున్న పారాణి ఆరనే లేదు
నవ వధూమణి కపోలములింతనె

చుంబన శూన్యములై పోయెను త
న్ముఖమున కుంకుమ తిలకము రాలెను
పరివర్తన మిది విశ్వరూప సమ
మతలనిర్గతము జలద విశాలము

దశ దిశలందున వ్యాప్తినందియును
సకల అతలమున లయించి పోవును
ఓ పరివర్తనమా ! నీకుటిల భ్రుకుటిని
లోకము సర్వము నిలచి యుండినది

మా భ్రమ, మా మిథ్యాహంకారము
నీ వ్యాపారము, నీ కల్పనయే
నిరాకారమును సాకారమ్మును
సర్వము నీలో నేకాకారము

ఓ జలరాశి ! భవద్వక్షము పై
నర్తించును సచరాచరలోకము
నీతుంగ తరంగములు శతాధిక

అఖిల విశ్వ కీ ఆశావోం కా ఇంద్ర చాప వర్
అరే తుమ్హాకి భీమ భ్రుకుటి పర్ అటకా నిర్భర్ ।

తుమ్హారా హీ అశేష వ్యాపార్, హమారా భ్రమ మిథ్యాహంకార్,
తుమ్ మేం నిరాకర సాకార్, మృత్యు జీవన సబ్ ఏకాకార్.

అహే మహాంబుధి ! లహరోం సే శతలోక, చరాచర్,
క్రీడా కరతే సతత తుమ్హారే స్ఫీత వక్షపర్ ;
తుంగ తరంగోం సే శతయుగ, శతశత కల్పాంతర్
ఉగల్, మహోదర్ మేం విలీన కరతే తుమ్ సత్వర్;

శత సహస్ర రవి శశి, అసంఖ్య యహ ఉపగ్రహ, ఉడుగణ్
జలతే, బుఝతే హైం స్ఫులింగ సే తుమ్ మేం తత్ క్షణ్;
అచిర విశ్వ మేం అఖిల - దిశావధి, కర్మ, వచన, మన్
తుమ్హీం చిరంతన్ అహే వివర్తన హీన వివర్తన్ ।



శత సహస్ర రవి శశితారాతతి
స్ఫులింగమ్ములటు వెలుగును వెలియును
ఓసి వివర్తన రహిత వివర్తనమా !
నీవే శాశ్వతమవు జగతిని

కర్మ వచన మనసులు నీవే ఇల
నీవే చిరంతన స్వరూపమవు.



అనువాదము : శ్రీ దుర్గానంద్.

★ ★

# సదానీరా

తుమ్హేం నహీ దీఖీ?
బినా తీరోం కీ నదీ,
బినా స్రోత్ కీ
సదానీరా!

వేగ హీన, గతి హీన్,
చారోం ఓర్ బహతీ
నహీ దీఖీ తుమ్హేం
జల హీన్, తలహీన్
సదానీరా?

ఆకాశ్ నదీ హై, సముద్ర నదీ,
ధరతీ పర్వత్ భీ
నదీ హైం,
ఆకాశ నీల తల్,
సముద్ర భంవర్,
ధరతీ బుద్‌బుద్, పర్వత్ తరంగ్ హైం
ఔర్ వాయు
అదృశ్య ఫన్
తుమ్ నహీం దేఖ్ పాయే,
ఛంద హీన, శబ్దహీన, స్వరహీన, భావహీన్,
స్ఫురణ, ఉన్మేష, ప్రేరణా,-
ఝర్ నా, లపట్
ఆంధీ.

నీచే, ఊపర్ సర్వత్ర్
బహతీ సదానీరా—
నహీం దీఖీ తుమ్హేం?

---

# సదానీరానది ★ ★

తీరములు లేని నది
నీరము లేని నది
కనపడగ లేదా
సదా నీరానది ?
గతి హీన
వేగ హీన
జల హీన
తల హీన
సదా నీర
నలువైపుల
ప్రవహించెడి
సదా నీర
కన రాదా ?
గగనమ్మె నది
సాగరము నది
భూమి నది
భూధరము నది

ఆకాశము నీలతలము
సముద్రమే సుడిగుండము
బుద్బుద మీ భూమి తలము
పర్వతాలు తరంగాలు
వాయువు అదృశ్య ఫేనము
ఛందో రహితము
శబ్ద విరహితము
స్వర హీనము,
భావ హీనము

తుఫానుతో చుట్టుకున్న
నిర్ఝరమును
కనలేవా ?
బహుదిక్కులతో
ప్రవహించెడి నది
కనపడ లేదా
సదా నీర నది,

అనువాదము: శ్రీ దండమూడి మహీధర్

ఓ మమాళియో,
యహీ సోనేకా మధు
కహాఁ సే లాయీ ?
వే కిస్ పార్ కే బనే థే
సద్యః ఖిలే ఫూల్ ?

జిన్ కే పంఖుడియాఁ
అంజలియోం కీ తరహ్
అనంతదాన్ కేలియే
ఖులీ రహతీ హైఁ.

కితనే స్రష్టా
స్వప్న ద్రష్టా
చితవన్ తూలీ సే
ఉస్ కే రూపరంగ అంకిత్ కర్ లాయే.

ఫూలోం కే హార్
పుష్పోం కే స్తబక్ సంజోకర్
ఉన్హోఁ నే
కుష్మాఁయా హోటే లగాయి !

రూప్ కే ప్యాసే నయన్
మధు నహీఁ ఛీన్ సకే.
ఓ సోనే కీ మాఖీ
తుమ్ మర్మ హీ మేఁ పైఠ్ గయీ.

స్వర్గ మేఁ ప్రవేశ్ కర్
హిమాలయ-పే అపేక్

## తేనె పట్టు ★ ★

తేనెటీగలారా ఇటు
తెచ్చితిరెటు నవమధువును
సుదూరాన సుమ మంజుల
సుందర వనములదా అది ?

సుమ దళాలు అంజలిగా
అనంత దానము లొసగెడు
వనలక్ష్మి కరాలనుండి
కొని తెచ్చితిరా ?

కళా స్రష్టలెందరో
స్వప్న ద్రష్ట లెందరో
మనస్సనెడు కుంచియతో
వినిర్మించిరో రూపం

ఎన్నో పూల మాలలను
ఎన్నో కుసుమ గుచ్ఛాలను
వాసి వత్తులైన వాని
బజారు లందిచ్చినారు !

సుందరతా తృష్ణాళువులైన
నయనములు గ్రోలని
నవ మధువును నీవు గ్రోలి
తన్మయమై సుఖస్వర్గ
ధామమున్న ప్రవేశించి
హిమాలయము వంటి మౌన
సుమాంతముగ తొలగ ద్రోసి
గుంజితివే తేటీ !

ఋద్ర మాన్ కో
గుంజిత్ కర్ గయీ :

ఉస్ మాణిక్ పుష్పరాగ్ కే
జల్‌తే కటోరోంమేం
కైసా పావక్ రహా,
హీరక్ రశ్మియోం భరా ?

జిసే దుహా కర్
తుమ్ ఘట్ భర్ లాయీ !
కౌన్ అరూప్ గంధ తుమ్మేం,
కల్ కా సందేశ్ దే గయీ ?

ఓ గీత్ సఖీ !
యే బోల్‌తే పంఖ్ ముఝే భీ దో,
జో గాలే రహతే హైం—

ఔర్
వహీ మధు కీ గహరీ పరఖ్,
మైం భీ
మధు పాయీ ఉడాన్ భరూంగా :

మానవతా కీ రచనా
తుమ్హారే ఛత్తే సీ హో,
జిస్ మేం స్వర్గ ఫూలోం కా మధు,
యుపకోం కే స్వప్న,

మానవ హృదయ్ కీ
కరుణా మమతా,
మిట్టీ కీ సౌంధీ గంధభరా
ప్రేమ్ కా అమృత్,
ప్రాణోం కా రస్ హో.

మణులవంటి పుష్పమ్ముల
రాగ సంజ్వలిత పాత్రల
వజ్ర రశ్మి వొలుకు నట్టి
పావక మెట్టుల నిలిచెను ?

అందునుండి నవ మధువును
అతి నిపుణత నెట్లు పితికి
తెచ్చితివో ? ఏ విరూప
గంధము రేపటి నవ సందే
శము నీ కందించెను ?

ఝుమ్మని గానము చేసెడి
కమ్మని నీ పతమ్ములు
స్వాదు మధురసమ్ములను
పరీక్షించు పతమ్ములు
నాకొసగు మధుపాయీ !
నే నెగసెద నీ వలెనే

మానవత్వ నిర్మాణము
తేనెపట్టు వలె జరుగుత
నందనవన కుసుమ మధువు
నవయువకుల స్వల్పమధువు
కలగలిసిన తేనె పట్టు
వలె వెలయుత సుందరముగ !

మానవ హృదయము నందలి
కరుణయు మమతయు తియ్యని
మృత్స్నా గంధమ్ములతో
ప్రేమామలిత ధారలతో
మానవతా నిర్మాణపు
తేనెపట్టు వెలయుగాత !

అనువాదము : శ్రీ దండమూడి మహీధర్

(7 వ పేజీ తరువాయి)

## పంత్ జీవిత పరిచయం

ప్రొఫెసర్ శివాధార పాండేయగారు పంత్‌కు ఎంతో ప్రోత్సాహమిచ్చి ఇంగ్లీషు కావ్యాధ్యయనంలో మార్గదర్శకు లయ్యారు. సంస్కృత సాహిత్యంలో కూడా అభినివేశం సంపాదించి కవిత్వ శక్తిని మరింత మెరుగు పెట్టి దినదిన ప్రవర్ధమానుడయ్యాడు. పంత్‌కు మైనపువత్తి వెలిగించుకుని చదివే అలవాటు ఉంది. ఈ అలవాటే అతని ప్రారంభిక కృతులెన్నిటినో అగ్నిదగ్ధంచేసింది. "కలరవ్" "నీరవతార్" అనే రెండు వ్రాత ప్రతులు మైనపు వత్తికి ఆహుతి యైనాయి. అదృష్టవశాత్తూ పంత్ కొన్నిటిని మాత్రం తిరిగి స్మరణం చేసికొని వ్రాసుకున్నారు.

1921 లో గాంధీ నడపిన సహాయ నిరాకరణోద్యమానికి ప్రభావితుడై కాలేజీ వదలి పెట్టినారు. పంత్ ఉద్యమంలో క్రియాత్మకంగా పాలు పంచుకొనకుండా కవితా వ్యాసంగంలోనే సంపూర్ణంగా మునిగి పోయినారు. స్వతంత్రాధ్యయనం, ఏకాగ్రచింతన, వ్రాయడం యిలా ఆ రోజులు గడచి పోయినాయి. శివాధార పాండేయగారి నుండి కూడ సహాయం పొందుతూండేవారు. ప్రాచీనుల్లో శ్రీధర్ పాఠక్‌గారు ఆయనను ఎక్కువ ప్రోత్సహించారు.

1922 లో "ఉచ్ఛ్వాస" మను కావ్యం ప్రచురింపబడినది. ఈ చిన్న కావ్యం అజ్మీర్ లో ముద్రింపబడినది. అక్కడే పంత్ పెద్దన్నగారు రాజకుమారుల మేయో కాలేజీలో ప్రాధ్యాపకులుగా పనిచేస్తూ ఉండేవారు. 1923 లో "పల్లవ" కావ్యం ప్రసిద్ధిలోనికి వచ్చింది. ఒక్కొక్క సంవత్సరం తేడాలతోనే 'వీణ' 'గ్రంథి' కావ్యాలు కూడా ప్రచురింపబడ్డాయి. ఇవి రచనా కాలం దృష్ట్యా 'పల్లవ' కావ్యానికి ముందువి.

కవి పంత్, కవి రూపంలో ప్రసిద్ధినీ, విజయాన్నీ, సర్వజనాహ్లాదాన్నీ, సంపాదించినారు. కాని విధి చేతుల్లో ఆయన సాంసారిక సుఖం అదృశ్యమై పోయింది. అన్ని సౌకర్యాలతో సంపదలతో, నిండి కళకళలాడుతున్న పంత్ కుటుంబం కొద్ది రోజులలోనే ధనజన క్షీణమయింది. పెద్ద ఇల్లు 1926 లో అమ్మివేయవలసి వచ్చింది. 1927 లో మధ్యమ సోదరుడైన రఘువర్ దత్ పంతుగారు మరణించారు, దాదాపు ఆ రోజులలోనే ఒక అక్క చనిపోయింది, ఒక సంవత్సరం లోపలే తన్ను అమితంగా ప్రేమించి, పెంచిన

తండ్రి మరణించారు. 1928 వరకూ దైవం యిలాగే యీ కుటుంబం మీద శీతకన్ను వేసివుంచింది.

అప్పటి కింకా పంత్ ప్రపంచంతో పోరాటం సాగించు కోవడానికి తన్నుతాను ఒడబర్చు కోలేదు. సాంసారికంగా తానింత నిరాశ్రయుడౌ తాడని కలలో కూడ ఊహించు కోలేదు. కాని అతనికి తెలియకుండా అతని మనస్సులో భావిసూచనగా ఒకమూల ఒదిగి ఉండి యుండవచ్చును. అందువల్లే ఆధ్యాత్మిక చింతనా బలంతో కవితావ్యాసంగం నుండి ఆయన ఎప్పుడూ జారిపోలేదు. ఆయన ఆదర్శాలు నిరుత్సాహజనకాలు కాలేదు. సత్యం, శివం, సుందరం మీద నున్న ఆయన అచంచల విశ్వాసం అంధకారావృతము లైన, ఆ దుర్భర క్షణాల్లో కూడా ఆరిపోక మిణుకు మిణుకు మని వెలుగుతూనే ఉంది. అతని దృష్టి వికీర్యమాణం కాలేదు. 1926 లో పంత్‌కి మొట్ట మొదటిగా అద్వయ చైతన్యాలోకం దర్శనమిచ్చింది. పల్లవ కావ్యంలో సంగ్రహించిన 'పరివర్తన మనే కవిత, సౌందర్య, ఐశ్వర్యాలతో అనుప్రాణితమైన ఆయన కావ్యసృష్టిలో ఒక మజిలీని అంతమొందించి రెండవ మజిలీని ప్రారంభం చేస్తుంది.

1929 లో పంత్ చాలా అనారోగ్యంగా ఉన్నారు. స్వర్గీయులైన డాక్టర్ నీలాంబర జోషీగారు ఆయనకు చికిత్స చేశారు. ఇలా యిరువదవ శతాబ్దంలో మూడవ దశాబ్దము ఆయని సిద్ధీ, ప్రసిద్ధీ, రోగమూ, శోకమూ, మానసిక, శారీరక వికృతి, వికాసములతో కలసియున్నది. 1930 లో పంత్ అల్మోడాలో విశ్రాంతి తీసికొని క్రొత్త మజిలీని నిర్మించు కోడానికి ప్రయత్నం సాగించారు.

1931 నుంచి 1940 వరకు పంత్ యెక్కువ సమయం కాలాకాకంర్ (అవధ్) లో కువర్ సురేష్ సింహాతో పాటు ఉన్నారు. ప్రయాగ కూడా వసూ పోతూ ఉండేవారు. అప్పుడప్పుడు అల్మోడాను కూడా చూచి వస్తూ ఉండేవారు. నాల్గవ దశాబ్దము సామాజిక శాస్త్రము, జ్ఞాన విజ్ఞానము, వివిధ సాహిత్యాధ్యయనాలూ, లోక శ్రేయస్సుకు కావలసిన సిద్ధాంతాలు, అలాంటి ఆలోచనలలో గడచిపోయింది. ఈ దశాబ్దంలోనే పంత్ 'గుంజన్' 'జ్యోత్స్న' 'యుగాంత్' 'యుగవాణి' 'గ్రామ్య' లను రచించి ప్రచురించారు. ఇప్పుడు పంత్‌లోని ప్రాకృతిక సౌందర్య ప్రధానమైన భావసృష్టి మానవీకరణం గానూ, సామాజికాన్వేషణ గానూ మార్పు చెందింది. పద్యా ప్రభావోన్నతు

దైన రవీంద్రుని స్థానంలో సబర్మతీ సాధువు అడుగు పెట్టినట్లైంది. మార్క్సు వాదాన్ని అధ్యయనంచేసి దాని నుండిచోదక శక్తిని పొంది కవిపంత్, లోక జీవితాన్ని పరిమార్జనం చేయ ప్రయత్నించారు. కాని చరమ లక్ష్యం తుట్ట తుదకు గాంధీ వాదమే అయింది. నేడు మార్క్సు వాదాన్నుంచి సహాయాన్ని పొంది రేపు గాంధీవాదాన్ని స్థాపించ వలసి వచ్చునన్న సిద్ధాంతంలో ఆయ నకు నమ్మక మున్నది. నైసర్గిక సృష్టిలాగానే సంతులితమైన మానవ హృదయం, సమతా సౌందర్య సంపన్నం కావాలనీ, వికాస శీలుడైన వ్యక్తి వలె సమాజం కూడా వికాసం పొంది ఒక రకమైన సామంజస్యంలోకి రావాలని అప్పుడే పృథ్వి బాహ్యాంతరములందు సౌందర్య ప్రపూర్ణమై స్వర్గతుల్య మౌతుందనీ, ఆయన నమ్మకం. అదే ఆయన, సిద్ధాంతమూ, స్వప్నమున్నూ.

ఈ శతాబ్దపు ఐదవ దశాబ్దంలో ఒక క్రొత్త మజిలీ ఆరంభమైంది. అరవిందుని తాత్విక సిద్ధాంతం కవి పంత్ మీద ప్రభావం చూపింది. మానసిక, ఆర్థిక సంఘర్షణాల మధ్య కూడా కవి పంత్‌లో అణగి ఉన్న విశ్వ శ్రేయోభిలాష కుంఠితమై పోలేదు. ఒక క్రొత్త వెలుతురు ఆయనను అభిభూతం చేసింది. వ్యక్తి, సమాజాన్ని పరివర్తితం చేయడానికి చాలా లోతుకు పోయి అన్వేషణ చేయడం అవసరమని ఆయన భావించారు. అతి మానస శక్తినీ, మూల ప్రజ్ఞను, యీ సమస్త ప్రపంచానికి ఆధారభూతంగా నిలిచివున్న శక్తిని జాగృతం చెయ్యకుండా పరివర్తనం చెయ్యబూనడం అసంభవమని ఆయన వాదన. అరవిందుని తాత్విక సిద్ధాంతం పంతును ఒక క్రొత్త కావ్యమార్గంలోనికి ప్రవేశింప జేసింది. అందువల్లే 1945-46 లో 'స్వర్ణ కిర ణము' స్వర్ణధూళి' అనే కావ్యాలు వెలుగు లోనికి వచ్చినాయి. ఇలాగే కవిలో నవీన స్వర్ణచైతన్యం, ఉద్గమశక్తి వికాసం పొందుతూ వెలుగు నింపు కొన్నవి.

ఐదవ దశాబ్దంలోనే కవి పంత్ భారత దేశంలో చాలా ప్రదేశాలలో పర్యటన చేసి వచ్చారు. దక్షిణ భారతంలోనూ, పశ్చిమ భారతంలోనూ కొన్ని సంవత్సరా లున్నారు. 1947 లో ప్రయాగ వచ్చి 'లోకాయతాన్ని' స్థాపించడానికి తిరిగి ప్రయత్నం చేశారు. ఇలాంటి ప్రయత్నమే 1948లో ఒకసారి జరిగింది. కాని విజయం పొందలేదు, 'లోకాయతనం' ద్వారా కవి పంత్ విశ్వాత్మకములైన, సాంస్కృతికములైన కార్యకలాపములందు ఒక

కూడలి స్థలమును ఏర్పాటు చేయవలెనని సంకల్పించినారు. అది విద్యాసంస్థ గానూ, పరిశోధన సంస్థగాను, కూడా ఉండాలని ఆయన కోరిక. పంత్ కలలు గన్న యీ సంస్థ యింతవరకు రూపు రేఖలు దిద్దు కొన లేదు. దీని కొరకు ఆయన మనస్సులో తీవ్రమైన ఆకాంక్ష ప్రబలి ఉంది. ఈ శతాబ్దపు ఐదవ దశాబ్దంలో 'మధుజ్వాల' అనే కావ్యం వెలువడింది. ఈ కావ్యం 'ఉమర్ ఖయాం' రుబాయితులకు గేయ రూపాలలో ఇచ్చిన అనువాదము. మూల పారసీ భాషనుంచి అనువాదం చేయబడింది. ఈ అనువాద కార్యంలో పంతుకు సహాకరించిన వారు ప్రసిద్ధ ఉసుమూ కవులైన స్వర్గీయ హాజరత్ జిగర్ గోండవీ గారు. ఈ అనువాదం మూడవ దశాబ్దంలో పూర్తి అయింది.

1948 లో 'ఖాదీపుష్పాలు' లో అంతర్భాగంగానున్న "శ్రద్ధాపుష్పాల" నే భాగంకూడా వెలుగులోనికి వచ్చింది. 1949 లో "ఉత్తర" "యుగపథ్" అనే కావ్యాలు రచింపబడినాయి, పంత్ గద్యనాటకాలు కూడా వ్రాశారు. కాని అ వెక్కడో పోయినాయి.

1950 లో ఆకాశవాణితో పంతుకు సంబంధం ఏర్పడింది. ఇప్పుడు కూడా ఆయన ఆకాశవాణికి పరామర్శదాత, సాహిత్యంలో సలహా యిస్తూ ఉంటారు. ఈ రూపంలో కూడా పంతు స్వదేశ సాంస్కృతిక చైతన్యం కొరకు చాలా శ్రమించారు. ప్రస్తుత దశాబ్దం, అంటే 1960 సంవత్సరం కవి షష్టి పూర్తితో పరిసమాప్తమౌతుంది. ఇటీవల ఎన్నో పద్య రూపకాలను యీయన రచించారు. మూడు కావ్య రూపకాలు "శిల్పి" అనే పేరుతో సంగ్రహింపబడినాయి. అది 1953 లో వెలువడ్డది. ఇంతకు పూర్వం 1951 లో ఆరు రూపకాలు "రజత శిఖరం" అనే పేరుతో వెలువడినాయి. "అతిమ" "వాణి" "కళా-బుసిరిచంద్రుడు" అనే కావ్య సంగ్రహాలు క్రమశః 1956–1957–1960 లో అచ్చుపడినాయి. 1959 లో "చిదంబర" అనే పేరుతో ఒక సంచిత సంకలనం ప్రచురించబడింది. దానిలో ఇరువది సంవత్సరములకు పూర్వం అప్పటి వరకూ వచ్చిన 'పల్లవ్' కూడా వచ్చింది. 'రశ్మిబంధ్' 'ఆధునిక కవి సుమిత్రానందన్ పంత్' అనే లఘు కావ్య సంగ్రహాలు కూడా ప్రచురింపబడినాయి. ఒక పెద్ద నవలను వ్రాసి తద్వారా తన కవితా వ్యాసంగాన్ని మంగళాంతం చెయ్యాలని ఇప్పు డాయన కోరిక.

ఇరువదవ శతాబ్దపు యీ ఆరవ దశాబ్దము కవి రచనా కాలం దృష్ట్యా ఐదవ దశాబ్దం. మొదటి దశాబ్దంలో అంటే 1916 లో "వేర్" అనే నవల దానితోపాటు విడివిడిగా కొన్ని పద్యరచనలు కూడా వచ్చినాయి. కావ్య రచనలో ఆ దశాబ్దం కావ్యరచనా కౌతూహలాలతో ఆకాంక్షలతో నిండిన దశాబ్దం రెండవ దశాబ్ది ప్రచురణలు నైసర్గిక సౌందర్య తృష్ణలతో నిండి నిబిడ కృతమైన సముద్ర రచనలు. అప్పుడు కవి విశ్వవైభవ సమ్మోహితుడు నిసర్గ దృష్టి అత్యద్భుతాలతో కన్నులను మిరుమిట్లు గొలుపుతూ ఉండే రచనా కాలంలో ఆయిన మూడవ దశాబ్దం గడచింది. మానవ హృదయంలో, మానవ జీవితంలో, మానవ సమాజంలోనూ సౌందర్యాన్ని నింపి ఒకరకమైన సామ్యం ఐక్యాన్ని నెలకొల్పాలన్న తపనా తహతహలూ కానవచ్చును. నాల్గవ దశాబ్దంలో స్పష్ట నిర్దిష్టమైన అతిమానుష మహోన్నతములో కవి హృదయం ప్రయాణం చేస్తున్నట్లు కనుపిస్తుంది. ఐదు ఆరు దశాబ్దాలలో కవి పంచ జీవితమూ, మనస్సు, మానవుడూ, విశ్వమూ వీటన్నిటినీ పరివర్తనం చేయాలి అన్న సంకల్పంతో పని చేస్తున్నట్లు కనుపిస్తున్నాను.

రచన : శాంతిజోషి

నరేంద్ర శర్మ

---

## కావలెను

దక్షిణ భారత హిందీ ప్రచార సభ-ఆంధ్ర, కార్యాలయములో పని చేయుటకు క్రింది యోగ్యతలుగల కార్యకర్తలు కావలెను.

యోగ్యతలు :—రాష్ట్రభాషా విశారద.

S. S. L. C.

హిందీ, ఇంగ్లీషు టైప్రైటింగు, లెక్కల అనుభవంగల వారికి ప్రాధాన్య మొసగబడును,

యోగ్యతలు, అనుభవమునుబట్టి వేతనము ఒసగబడును.

దరఖాస్తుతో హిందీ, ఇంగ్లీషు వ్రాత నమూనాలు, ప్రమాణ పత్రములకు నకళ్లు, నడవడిక సంబంధించిన రెండు ప్రమాణ పత్రములు పంపవలెను. దరఖాస్తు స్వదస్తూరీతో వ్రాసి శ్రీ కార్యదర్శి, దక్షిణ భారత హిందీ ప్రచార సభ-ఆంధ్ర, హైదరాబాదు—4 కు తా. 30-6-1960 లోపుగా అందునట్లు పంపవలెను.

కార్యదర్శి.

---

